I లంకారెడ్డి రాఘవారెడ్డి గారి స్వంతం



# రైతు భజనావళి

TPLA 129 B144
B-46

# రైతు భజనావళి

సంపాదకులు

ఆచార్య రంగా



ప్రకాశకులు:

కిసాన్ పబ్లికేషన్స్

వరదా ముత్తియప్పన్ వీధి, మద్రాసు.

మొదటి ముద్రణ 1934

రెండవ ,, 1935

మూడవ ,, 1936

నాల్గవ ,, 1937

అయిదవ ,, 1937

ఆరవ ,, 1938

ఏడవ ,, 1939

ఎనిమిదవ ,, 1940

# సమర్పణ

# విజయహారతి, వీరగంధము
# మన మందసా వీరులకు

"కార్మిక కర్షక రాజ్యానికి జై" అని మార్చి 27 తేదీ ననేగదా మీరంతా పలాసాలో అఖిలభారత రైతుమహాసభయందు ఎలెత్తి విజృంభించి కూకలిడినది! పోలీసుల 144 శెక్షనును ధిక్కరించితిరి. ఆలస్యమే లేక, నాయకులమించి, కాంగ్రెసును దాటి, వీరుల నపహసిస్తూ, ఏప్రియలు 1 తేదీననే సామ్రాజ్య తుపాకుల కెరయగుచూ, భారతీయ ప్రజాసామాన్యమునకెట్టి త్యాగమార్గమును, సాహస స్వరూపమును, కల్గించితిరి! మీరు అయిదుగురు పూజ్యులు, ధన్యులు, ఆదర్శప్రాయులు.

మీరే రైతులకు, కూలీలకు మహాత్ములు. ఆ గున్నమ్మ, "శెట్టిపల్లి ద్వారం"గుండా వస్తూ పోతూ ఆ పలాసా సభయందెట్టి వున్నతాదర్శాలను పొందిరో, వీరప్రతిజ్ఞల చేసుకొనిరో యీ మీ సాహసంపు త్యాగపధమే తెల్పుచున్నది.

మీ భౌతిక శరీరాలైతే పోలీసులతుపాకుల కాహుతి ఐనవి. మీ ప్రాణాలైతే జమీందారుల దుండగాలకు ఆవురుమన్నాయి. మీరీ లోకాన వుండరాదనగల్గింది సామ్రాజ్యపెత్తనం.

కాని మీరు వేయిరెట్లుగా బ్రతికివున్నారు. మా హృదయాలు మీ వశమైనవి. మా రక్తబిందువులందు మీరు చిందులు

"నీవు పెళ్లాడిన మోహనరావు నన్ను మోసగించిన ఆ దుష్టునికొడుకు. అయిందేదో అయింది. నీవు అతనిముఖం చూడకు అతనికీ నీకూ సంబంధం లేదు" అంటూ తండ్రి, సుశీలకు తన కడపటిమాటచెప్పి ప్రాణాలు వదలాడు

? దుష్టుని కొడుకూ దుష్టుడు అవుతాడా
వృద్ధుల వైరాలకు యువతీయువకుల ప్రేమ ?

# బలికావలసిందేనా?

ఈ సందేహం ప్రధానాంశంగాగల

జగదీష్ ఫిలిమ్సు వారి



ప్రేమోపాసకులైన మిమ్ములను తప్పక ఆకర్షిస్తుంది

## డైరెక్టర్: వై. వి. రావు

తారాగణం: లలిత, వై. వి. రావు, నాగయ్య, రాజరత్నం, దొరస్వామి, రంగస్వామి, కాశీచెంచు.

వివరాలకు: శ్రీ జగదీశ్ ఫిలిమ్సు, 11 ఆరమ్సురోడ్డు, కీల్పాక్, మద్రాస్.

ద్రొక్కుచున్నారు. మా త్రికరణములందు మీదే చైతన్యము. అదియే విజయలక్ష్మి!

మరువము, మిమ్ముల, మీ జీవితాదర్శముల; మీరు జపించిన రైతుకూలీమంత్రమును జపించుతాము. కార్మికకర్షక రాజ్య స్థాపనాసూత్రమును సాధించుతాము. ప్రజానీకపు మోక్షము, అధర్మపు అధికారాల అంతమును, సాధించుతాము. మీ పాద ధూళిని మా హృదయపీఠముపై ధరించుతాము. ఇవే మా జోహారులు; వీరుల ప్రతిజ్ఞా పత్రములు.

మీ "స్థిరప్రజ్ఞతా" సాక్షాత్కారము భారతీయ రైతుకూలీలకు విజయలక్ష్మిని చేకూర్చుగాత!!

లక్ష్మినారాయణ

# ఉపోద్ఘాతము

రాజకీయ హక్కులు కొన్ని మన ప్రజలకు రానున్నవి. కాని, సంపూర్ణ స్వరాజ్యమే కార్మిక, కర్షకుల అభిలషణీయము. రానున్న స్వరాజ్యపు భారతావనిలో, రైతులకు రక్షణ, కార్మికులకు కాపుదల అగత్యము. ఇప్పటివలె, రైతులను జమీందారులు పీల్చి పిప్పిచేయరాదు; కార్మికులను కోటీశ్వరులు కట్టిపెట్టరాదు. దేవు డొకడుంటే, అతడీ విశ్వమందు నిల్చియుండ దలంచుకుంటే, ప్రజల నెల్లరిని రక్షించే భారము తన నెత్తిమీద పెట్టుకోవలెను. తుప్పుపట్టిపోయిన సాంఘికాచారములు, బూజుపట్టిన పురాణములు, విప్లవ తుపానులో యెగిరిపోవలసినదే!

ప్రపంచ మందొకచోట రైతులు రాజ్యానికి వచ్చినారు, కూలీలు పెత్తనము చేస్తున్నారు. కోటీశ్వరుల కచ్చట తావులేదు. తినటానికి తిండి, పరుండటానికి పడక అచ్చట యెల్లరికి కరవులేకున్నవి. ప్రజాసామాన్యమునకు పరువు ప్రతిష్ఠ లచ్చట లభ్యమగుచున్నవి. ఆంధ్ర ప్రజలుకూడ అలాంటి స్వరాజ్యమునే కాంక్షించుచున్నారు.

ఇది కష్టాలకు కట్టడి కల్గించే కలియుగం. పసికిరాని దేవుడూ, దెయ్యము యీ కాలంలో పారిపోవాలిసిందే! నష్టకారకమైన అన్ని సంస్థలు, ఆచారాలు, ఆరామడమారం వెళ్లాలిసిందే! జ్ఞానమే యీ కాలపు దేవాలయం. సేవయే ఇప్పటి భక్తిస్వరూపం, సర్వజనశ్రేయమే యీనాటి ప్రజలు కోరు వరప్రసాదము. పరస్పర సహకార సంపదే యీ దినపు కామధేనువు. పరులహింసించి, స్వాభిమానమును ప్రేమించి, పలువురిని పీడించి, కొలదిమంది వ్యక్తులకే ధనదాహము తీర్చు యిప్పటి దౌర్భాగ్యపు ధనధాన్య విభజన పద్ధతియే యజ్ఞపశువు.

భారతావని యందంతటిలో, ఆంధ్రావనిననే ప్రప్రథమమున, సాంఘిక తత్వము నిర్వచింపబడినది. ఆంధ్రుల సాంఘికవాదానికి శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారు మాటల పొందిక కల్పించిరి. నా భగ్న ప్రయత్నముల ద్వారా సమత్వ ధర్మానికి కార్యరూప మొసంగ బ్రయత్నించిన ఆంధ్రావనియందీ సామ్యవాదమును సుస్థిర పరచుటలో, రైతులు, హరిజనులు భజనచేయుచున్నారు. రానున్న రాజ్యాంగాధికారము ఏపేరున నైననేమి పెట్టుబడిదారులకే పంచియిచ్చు పెత్తందారులవంచి, రైతాంగ రక్షణచేయు యోధులకీ భజనావళి విజయము కల్గించుగాక, రైతు రాజ్యస్థాపన కుపకరించు గాక!

మన ప్రజలు సాధింపబూనిన సంపూర్ణ స్వరాజ్య సంపాదనకై 1933 నుండియూ అటు బర్మాయందు, ఇటు ఆంధ్రావని యందు యీ భజనావళి యుపకరించినది. రైతాంగ విద్యాలయ

హృదయ దుందుభులతో, దాక్షిణాత్య రైతువుద్యమ ప్రధాన తత్వమును తన గీతములచే నిర్వచించిన శ్రీ నెల్లూరు వెంకట్రామానాయుడు, రైతుసంఘ నిర్వాహకులు, శ్రీ న్యాయపతి నారాయణమూర్తి, నన్నపనేని వెంకటసుబ్బయ్య, గౌతు లచ్చన్న, మల్లంపాటి చెంచు రామయ్య, ప్రభృతుల కంఠా నినాదములతో భజనావళి తత్వము ప్రకటితమైనది.

• మూడవ ముద్రణమునుండి యీ తొమ్మిదవ ముద్రణకు రైతుభజనావళి పన్నెండు మాసాలలో పెరిగినదే? కారణమూ? ఆంధ్రుల ఆదరణయేనా? వారి అవసరముకూడ. రైతాంగ ప్రచారపు పెంపుకూడ. రైతుసేవాదళాలే కాక, కాంగ్రెసు ప్రచారకులు, నాయకులుకూడ 'రైతు భజనావళి'ని ఆదరించిరి, శరణు జొచ్చిరి, వుపయోగించిరి: ఇందులకొక గొప్ప కారణము కలదు. రైతాంగపు అవసరాలనే గాక, హృదయంపు ఆవేదనను, ఆశయాలను "భజనావళి" కొంతవరకు ప్రతిబింబించింది; ప్రజ్వలింపచేసింది, ప్రోత్సహించింది. కాంగ్రెసునకు రైతాంగముతో యెన్నికల సమయాన అవసరం కల్గింది. రైతాంగ అభ్యర్థుల నంగీకరించలేకుండినా, రైతాంగ ప్రణాళికను మ్రింగలేకున్నా, రైతు ప్రమాణపత్రముల సహించలేకుండినా, రైతుహృదయ ప్రతిబింబమగు "రైతు భజనావళి"ని కాంగ్రెసు శిరసావహించింది. ఇదియూ గొప్ప విజయమే. ఐనను ఆంధ్ర కవులింకా కాలానికి తగినంత వేగము, వేడి, వుత్సాహము ప్రకటించలేకున్నారా యనిపిస్తుంది. జాతీయులకు "భారతమాత" యెంత పవి

త్రమో, భారతీదేవి ఆరాధన యెంత అవసరమో, రైతాంగము నకు, భూదేవి, నాగేలు, కొడవలి, కవ్వము అంతగా పూజార్హాము. జాతీయవాదు లెంతగా జాతీయపతాకాన్ని లేపు చుందురో, కార్మిక కర్షకులు తమ సుత్తి, చేబాడిశ, నాగలి, కొడవలికై నిల్పు "యెఱ్ఱ జెండా" నంతగా ప్రేమించాలి! ఏరి? మన ప్రజల స్వధర్మ నిష్టాపరుల జేయుకవులు? రైతాంగమునకు నూతన భావజ్యోతిని ప్రసాదించు గాయకులు? కార్మిక, కర్షకులకు పూజనీయమై నూతన "భువనేశ్వరి"ని ప్రతిష్టాపించు అభినవ "వేదారణ్యు"లు?

ఆంధ్రకవి, గాయక, దళాధిపతులకు అభినందనాలు! వారి ప్రతిభ "రైతు భజనావళి" ద్వారా భారతీయులందరికే గాక, వివిధ దేశీయులకుగూడ ప్రకటింపబడుచున్నది, భారతీయ భాష లందు ఎంతగానో వారిచే సృజింపబడిన భజనావళికి చిత్రవిచిత్ర మైన "విశ్వామిత్ర" సృష్టి చేయబడుచున్నది. ఆంధ్ర ఆధునిక కవి సార్వభౌముడైన "పున్నవ" (లక్ష్మీనారాయణ)కు అఖిల భారత కిసాన్ కాంగ్రెసు అధ్యక్షపీఠమే సువర్ణ (ధాన్యరాశి) అభి షేక మొసంగినది.

ఆంగ్లమునందు యీ పాటలు కొన్ని తర్జుమా చేయబడి వివిధ రాష్ట్ర రైతుసేవకులకు ప్రోత్సాహము కల్గించుచున్నవి. హిందీయందిప్పటికే కొన్ని పాటలు బయల్వెడలినవి. త్వరలో అఖిలభారత రైతాంగ వుద్యమమునకు ఆంధ్రకవీశ్వరుల యీ భజనావళి నూతన తేజము కల్గించునని విశ్వసించుచున్నాను.




# ❖ ధర్మపత్ని ❖

సర్వాంగ సుందరంగా తయారయింది.

శాంతకుమారి, బేబీ లక్ష్మి, రాజు, సుశీల, గిరిజ, రాజామణి, కుటుంబరావు, హనుమంతరావు, ఆదినారాయణ, చలపతిరావు, సింహాచలం, కుమార్ మొదలైనవారు పాల్గొన్నారు.

ఫోటోగ్రఫీ : సురేంద్ర, కే. పాయ్

సౌండ్ : కె. కె. సరయ్యా

ఆర్ట్ : హెచ్. ఎస్. గంగనాయక్

మ్యూజిక్ : అన్నాసాహెబ్ మైన్కరు, మారుతి సీతారామయ్య

డైరెక్టర్ : శ్రీ పి. పుల్లయ్య బి. ఏ.

డిస్ట్రిబ్యూషన్ వివరాలు : ఫేమస్ ఫిలిమ్సు, బొంబాయి

రైతాంగ సేవాదళములు ఆంధ్రదేశమునందే కాక, అఖిల భారతావనియందు బయల్దేరి, నానాజాతి గాయకులు భజనావళులతో ప్రజల మేల్కొల్పునను ఆశకలదు. ఆంధ్రులు అఖిలభారత రైతులోక సేవయందు ముందంజవేయుచున్నందులకు ఆనందమొందుచున్నాను.

1939 సంపాదకులు

# ప్రకాశకుల విజ్ఞప్తి

ఈ ముద్రణము శ్రీ రంగాగారు కారాగృహంలో ఉన్న సమయంలో ప్రచురించవలసివచ్చింది. వారిధోరణిని అనుసరించే కొత్తగేయాలను సేకరించి, 1939 ముద్రణముకంటే కొంత వృద్ధిచేసి ప్రచురించితిమి. ఈ సంవత్సరము రైతుసేవకులు, నాయకులెందరో కారాగృహములలో క్రుమ్మగుచున్నారు. వారందరికీ మా అభివందనాలు. ప్రప్రథమాన జెయిలుకుపోయిననూ కృతిసమర్పణ సమయానికి అరుదెంచి తనవిద్యుక్తధర్మమును నిర్వర్తించుకున్నారు లక్ష్మీనారాయణగారు.

చిత్రగుప్త, కాగడా, వాహిని, క్రాంతి మున్నగు పత్రికలీ భజనావళి వృద్ధికి ఎంతగానో తోడ్పడినాయి. ఇందులోని హెచ్చు గీతాలను వాటినుండే సేకరించినారము.

ప్రకాశకులు

# విషయ సూచిక.

# ఆ శ

(1) బ్రతుకు తెరువుకు శ్రమ
పడుతున్న, నీశక్తి
తెలిసికొని, తెలివితో
మెలగవలెనందీ
క్షణములో ఆశ "లేచిందీ"
చర, చరా పైకినడపిందీ॥

(2) నడపించి, నడపించి
నదివొడ్డుచేర్చింది
అలలనుచూపించి
విలపించకందీ ॥క్షణ॥

(3) కృశియించు నీశక్తి
నశియించు నీశక్తి
యవ్వనపుకాంతితో
నవ్యభావాలతో
వికశించి వికశించి
విప్లవజ్వాలలయి
కార్మిక, కర్షకుల
కర్మ పుత్రలుతుడిచి
కల్మషము హరియించు
గంగాజలమ్ములా
విప్లవ బీజాలు
వెదజల్లమందీ ॥క్షణ॥

చదలవాడ పిచ్చయ్య (బాగడా)

# కర్షకుడు

సీ॥ ఘోరమీసము దువ్వుకొనుచు సిం
హాసనాసీనుడై వెలుగు భూమీశుమహిమ
శాస్త్రవనిర్భేద్య సరణితంత్రంబుల
గల్పించు మంత్రి పుంగవునిమహిమ
వీరకుమారులు వినుతింప సమర వి
హారిగా సైనికాధ్యక్షుమహిమ
గర్వాంధతను కన్నుగానక కేవల
భోగ్యుడై తిరుగు ఉద్యోగిమహిమ

దేశకాల స్థితులనెల్ల దెలుసుకొనుచు
ధనమునుగడించు మేటి వర్తకునిమహిమ
శీత వాతాతపంబులచే చెమర్చు
కర్షకా నీదు స్వేదాంబు కణముగాదె॥

కుర్రా వెంకటసుబ్బారావు.

# మ త ం

1. కపట జీవనం,

యిష్టంలేని
కపటులు కొందరు
ఒకటిగ జేరీ
కేయింబవలూ
యోచనచేసీ
స్వార్థం కోసం
సౌఖ్యం కోసం
మతమను దానిని
సృష్టించారు.
మంచి చెడ్డల
యోచనలేని
మొద్దబ్బాయిలు
దగ్గరజేరి
మాయా మాటలు
మెల్లగజెప్పి
కళ్లకు యేదో
కాటుకవేసీ
మతపాశాల్లో
బంధించారా
భీరువులూ

2. మతాభిమానం

ముక్తికి మార్గం
మతాభిమానం
మనుజుల భాగ్యం
మతోద్ధరణయే
మానవ ధర్మం
పరమత సహనం
పాపంబంటూ
దేవుని వాక్యం
బిదియేనంటూ
మంత్రాలేవో
మెల్లగ జదివి
మతముల పేరిట
మత్తెక్కించీ
హత్యలుచేయ
కత్తులు యిచ్చి
ముందుకు నెట్టేరు.

3. అల్లా పేరిట

హత్యలుచేసే
క్రీస్తు పేరట
ఖూనీచేసే

రాముని పేరట
రక్తంగార్చే
మత భక్తులకు
మోక్షంలేదండి.
భారతమాత
భీకర శాపం
పీడిత ప్రజల
రోదన ధ్వనులూ

అనాథ స్త్రీలా
అశ్రుధారలూ
మతముల పేరట
మోసంచేసే
మతముల పేరట
హత్యలుచేసే
మూర్ఖులనందర
మాడ్చక పోతాయా.

పునుకొల్లు వెంకటేశ్వర్లు.

*   *   *   *

భిన్నరూపము లెత్తవలదే — ఓ మతమ
భిన్నముగ మము చేయవలెదే ? భిన్న.

౧. కష్టాలు అనుభవించామే — ఇపుడు
కలవరము తెలిసికున్నామే॥
కలసి మెలసి యుండెదామే — ఇంక
కాకులల్లెను మెలగుతామే॥ భిన్న.

౨. ఆచారమును మార్చుకొనుమా — లేకున్న
అగచాట్లు మేము పడగలమా
అన్యులము యెప్పుడును కామే — మేము
అందరము అన్నదమ్ములమె॥ భిన్న

3. ఒక్కచోటను పుట్టినామే — మాకు
ఒక్కమ్మ ఒక్కయ్య యేనె.
ఒక్కచోటను పెరిగినామే — మేము
ఒక్కచోటికె పోయెదామె॥ భిన్న.

3

౮. దేవు డందఱివాడుకాడా — అతని
దర్శనము కొందఱికి కాదా ?
దీనజనులం టేను తంటా ? క్షామం టే
దేవళము నీయబ్బగంటా.

భిన్న.

గురునాథం, రామారావు.

## దృష్టి

1. అణగివుండినజాతి
నభివృద్ధిపరచుటకు
ఒకవెలుగు మెరుపులా
చకచకావచ్చింది.

2. అధికారవర్గమ్ము
అడ్డి ఆపేందుకే
మారణయంత్రాల
శరణుజొచ్చింది.

3. మారణయంత్రాలు
మర్మరధ్వనులతో
ఆకాశవీధిలో
సంచరిస్తున్నయ్.

4. ధనికదావానలం
కనికరము లేకుండ
పోరాడు శ్రమికులను
పారగొడుతుందీ

5. వలసరాజ్యపువాంఛ
కలతలను గల్పించి
బలహీనదేశాల
పట్టితింటుందీ

6. శ్రమశక్తిహరియించి
శ్రమికులను బలియిచ్చి
శల్యాలపై రాజ్య
స్థాపనము జేస్తారు.

7. చీకటిని చీల్చుకొని
చిరునవ్వు మొగముతో
వెలుగు కన్యకవచ్చి
వెన్ను చరిచిండి.

8. శ్రమజీవులందరు
శాంతిప్రియులందరు
ఏకమై విశ్వంలో
వెలుగు తెండంటుంది.

చవలవాడ పిచ్చయ్య.

# పిలుపు!

1. కార్మికులార! కర్షకులార!
కలసీ మెలసీ కదలిరావలె —
సామ్రాజ్యవాదము సమయింపంగ,
ధనికవాదము దగ్ధముచేయగ,
ప్రజాపాలనము ప్రతిష్ఠింపగ. కార్మిక

2. ఎండకుయెండి వానకుతడిసి
రేయింబవలును — రెక్కలు విరచుక
పాటుపడియెడి — పాపము! మీకు —
ఆకలిదీరగ...అన్నముబెట్టని
కుచ్ఛితధోరణి కూలద్రోయగా. కార్మిక

3. చెమటలనోడ్చి చేలనుపెంచి
ఇబ్బడి పంటల పండింపంగ
పండిన పంటను పట్టుకపోయి
గాదెలనింపుక ఖులులైతాము
పాతబకాయిల పైగానిమ్మని
పీడిచి మిమ్ముల పిప్పినిజేసెడి
పాడుపద్ధతిని బద్దలుచేయగ. కార్మిక

4. ఇచ్చేపదికి ఇరవై వ్రాసి
చక్రవడ్డీల్ చరచరగట్టి
తీర్చిన అప్పును దిద్దకయుంచి
వడ్డీతీరెను, అసలు యుండేనని
అనిశము జెప్పుచు అన్నతవాదులై
కష్టజీవులను కాల్చుకు తినియెడి
వడ్డీదారుల కడ్డముగొట్టగ. కార్మిక

గవను, సాంబశివరావు.

## దారిద్ర్యం

ధనవంతులు బొజ్జలు పెంచీ
దరిద్రులను దబాయించీ

కులుకుతు జీవిస్తూఉంటే
కోపిస్తారివి యేమంటే.

అభిమానం పరిత్యజించీ
యజమానికి ధనమార్జించీ

నిర్జీవపు బ్రతుకును బ్రతికీ
నీరయిపో నీచపుగతికీ !

ఈ ఘోరం యెప్పటివరకూ ?
మేమంతా చచ్చేవరకా ?

పెసుమర్తి కామేశ్వరరావు.

## బానిసలు

బానిసలంటే
పందులుగారోయ్ !
మనకూ వాళ్లకు
తేడాలేదోయి.
రక్తం ఉందీ !
మాంసం ఉందీ !

అయితేవారికి
సొంతంగావోయ్ !
వ్యక్తిత్వం పో
గొట్టుకు బ్రతికే
మానవులేనోయ్
బానిసలంటే !

భట్టిప్రోలు కృష్ణమూర్తి.





# రైతు ఢంకా

1. ప్రళయభేరీ భాంకృతులతో
మ్రోగుచున్నది రైతు ఢంకా
రైతురాజ్యము, రైతు దేశము
కలసివచ్చెను కర్షకా.

2. భావిరాజ్య ప్రభుడవీవని
పలుకుచున్నది రైతు ఢంకా!
భాగ్యరేఖను దిద్దుకొనుమని
పాడుచున్నది రైతు ఢంకా!

3. రాజ్యమంతయు రైతునందా
ధారపడినదటంచు దలచుము
పారతంత్ర్యము పారద్రోలగ
ప్రబల యోధుడవీవె దెలియుము.

4. స్వాతంత్ర్య సుఖమ్ము కొరకై
సల్పుమోయీ శాంతియుద్ధము
రైతురాజ్యపు రక్షకుండని
మ్రోతలిడియెడు రైతు ఢంకా!

5. రైతురక్షణ గణములివిగో,
రైతు ఢంకా మ్రోతలివిగో,
నడుముగట్టి శాంతిసమరము
సల్పుమోయీ, రైతు సోదర.

చల్లా నరసింహులు.

2

## భి క్షు వు

బిచ్చగాడినిచూచి కొట్టకండోయ్ బాబు
బిచ్చమెయ్యండోయి బాబూ
కూలినాలియులేక కుడువకూడును లేక
కట్ట గుడ్డను లేక కుంగిపోతున్నాను. బిచ్చ.
అద్దాలమేడల్లో ఆటక త్తెలతోటి
అడుగడుగు విందులు అస్థిరం బాబోయి. బిచ్చ.
సువర్ణమంతాను సుస్థిరంకాదోయి
సున్నితమ్మగు మీదు సుకుమారహస్తాల. బిచ్చ.
అర్ధరాతిరివేళ అందరూ నిద్రోతె
అన్నమో యంటు నే నల్లాడుతున్నాను. బిచ్చ.
కంటికీ మంటికీ కన్నీటిధారలై
కల్లోలపడుచున్న కష్టాలజీవికి. బిచ్చ.
ఆకలో ఆకలి, అన్నమో, అన్నమని
అడలిపోతున్న యీ అదృష్టహీనునికి. బిచ్చ.

సి. వి. యస్. పూర్ణయ్య.

## క ర్ష కు డు

ఆకలి ఆకలి
మండే ఆకలి
కండలేనియీా
ఎముకల ఆకలి
జీర్ణకోశముల
త్రెంచే ఆకలి. ఆ.
రైతునాయకులు
రాష్ట్ర నాయకులు
తీర్చలేనియీా
దుర్భర ఆకలి
రైతు రాజ్యమూ
వచ్చేవరకూ
కూలిరాజ్యమూ
వచ్చేవరకూ
తీరదు మాకు
కడుపు ఆకలి

చేవూరి రామమూర్తి.

## భక్తవరులకు ముక్తియా !

ధర్మసంస్థల ధనము మ్రింగియు
లెఖ్ఖ జెప్పగ నిక్కుచుండియు
అడిగినంతనె హరిహరీయను
భక్తవరులకు ముక్తియా ?

మైనరాస్తికి మేజరయ్యును
ఆస్తిచాలగ నపహరించియు
అడిగినంతనె హరిహరీయను
భక్తవరులకు ముక్తియా ?

కూలివారల కూలినివ్వక
మాడుమారల మాడ్చుచుండియు
రాతిరందున రామరామను
భక్తవరులకు ముక్తియా ?

(ముక్తినుంచి)

## మహా పాపాలు

పాపము ఘోరపాపము
దీనికి ఫలితము
నరకమూ నిత్యనరకము
కాకున్న తప్పదు

విప్లవం గొప్ప విప్లవం. పా.
పంటలన్నీ రాసిచేసి
ఇంటపోసి పురులగట్టి

వచ్చుకూలీ కిచ్చుజీతం
పిచ్చికుంచము తోనిచ్చుట. పా.

కోట్లకొలదీ కూలిజనము
కూడులేక మాడుచుండుట
పప్పునే యీ ఉప్పళంతో
గొప్పగా తిని కులుకుచుండుట

నీలువనీడాయైన లేక
వేలకొలది మనుజులుండ
మేడమిద్దెల భోగమందుచు
పాడు అద్దెలకిచ్చుచుండుట. పా.

శ్రీ హరి.

## శి ల్పి

నీ కళాకిరణాలు నిఖిల దిక్కులలోన
నిండించరా శిల్పి పండుతవిభాగ్యాలు ;
నిదుర మైకము వీడరా ;

భారతాభ్యుదయమ్ము గావించరా !!

కర్షకుడు నీవును కలిపి చేతులరెంటి
మన దేశ దాస్యమ్ము మంటలో గలుపంగ
ధీరులై పూనండిరా !

మీతల్లి వీరమాతనుకొండిరా !!

ఏనాడు మనవృత్తు లీగిపోయెనో నాడె
భారతీయుల పెంపు బాటపట్టిందిరా ;
శిల్పపీఠము నెక్కరా !

తిరిగి ఆ శ్రీవిందు నర్తించురా !!

కొండూరు వీరరాఘవాచార్యులు.

## వెనుదిరిగి చూచావా !

1. నీవు ఎన్నడైనను గాని
వెనుదిరిగి చూచావ ?
సుఖమనుభవించు నీయజమానికేసి ?

2. నడుము వంచుకుపోయి
మెడ నిలుపలేనట్టి
కడువృద్ధువైన ఓకూలీ !. నీవు.

3. బక్క దేహముతోడ
చిక్కు కేశములతో
దిక్కు లేనట్టియో కుర్రా. నీవు.

4. మసిగుడ్డలతో పొగల
మసికంజ్లతో, దిశల
నసిదప్పిపరికించ శ్రమికా. నీ.

5. కష్టించికూటికికరవాచి,గుడిమీది
దిష్టిబొమ్మనుమాదు
దృష్టిపథమునుదెచ్చు రైతూ. నీ.

దాసరి సుబ్రహ్మణ్యం.

## ఒయసుమళ్లిన ఓ అన్నయ్యా !

1. యువకుని రాజ్యం
యువకుని భోజ్యం
కారాగృహాలూ
కన్నీళ్లైనా
ఒళ్లూవిరిచి
కళ్లూ తెరిచీ
యువకుడు లేస్తే
యూరోపంతా
గడగడలాడిన
గాథల వినవా ?

2. హెచ్చు తగ్గుల
మెచ్చనికాలం.
అంతా సమమను
అధనపుకాలం
ఆటలు సాగవు
మాటలు మానీ
అందరి నొకగతి
ఆరయుమయ్యా
ఒయసుమళ్లిన
ఓ అన్నయ్యా !

బి. రంగనాధ్.

## కావాలి ! కావాలి !

బీదసాదల నిరుపేద జీవనము
కర్షక జనావళి కరుణ జీవనము
కార్మిక సంఘాల కష్టజీవనము
తనచేతి కుంచలో దనరారునట్లు
కటిక గుండెలనైన కరిగించునట్లు
రచియించు చిత్రకారకులు కావాలి,
రాణించు చిత్రకారకులు కావాలి,
భావిభారతదేశ భాగ్యోదయమునకు
కావాలి! కావాలి! కావాలి నేడు.

భరద్వాజ.

# సామ్రాజ్య తత్వం !

1. కాలగర్భమున
ఎన్ని జాతులూ
ఎన్ని దేశములు
రాజ్యాంగములు
రారాజులు
నిరంకుశత్వం
తరాలదాస్యం
నాగరికతలు
దాగినవో ! పూడినవో
కాలగర్భమున !!!

2. ధృవాలమధ్య
భువిలోమసిలే
మానవజాతులు
మానుషమడిచి
నిరంకుశముగా
పరిపాలించిన
పారసీక సామ్రాజ్యం
దాగినదీ, పూడినదీ ;
కాలగర్భమున !!!

3. ఖండఖండముల
గండు ఖండమగు
ఆసియాధరణ
వాసిగాంచిన
బాబిలూని సామ్రాజ్యం
ప్రపంచమేది
అని వాపోయిన
గ్రీకురాజ్యం
దాగినదీ, పూడినదీ ;
కాలగర్భమున !!!

5. యుగయుగాలకూ
మగటిమిజూపీ
పృథ్వీజాతుల
వణికించామని
ప్రపంచమునకో
పరిపాలనమూ
నాగరికతనూ
నేర్పినారమని
రొమ్ముజూపిన
రోమనుసామ్రాజ్యం
దాగినదీ, పూడినదీ ;
కాలగర్భమున !!!

6. ప్రొద్దుగుంకని
పెద్దరాజ్యం
స్థాపించామని
సంతసపడుతో
లాభం ! నష్టం !
పాలనసూత్రం
నిరంకుశంగా

దాగినదీ, పూడినదీ ;
కాలగర్భమున ! ! !

4. సకల ప్రపంచము
జయించివైచితి
జయింపగా నిక

పరిపాలించే
ఎట్టిరాజ్యమూ
దాగిపోదూ ?
పూడిపోదూ ?
కాలగర్భమున ! ! !

శ్రీ హ రి.

## దేవుడెక్కడ ?

మండువేసంగిలో
మిట్ట మధ్యాహ్నన
ఎండనిప్పులు గ్రక్క
వేడిగాడ్పులు వీవ
వాడిన ముఖాలతో
శుష్కదేహాలతో
మురికిబట్టలుగట్టి
తట్టనెత్తినబెట్టి
కూలినాలి చేసే
కూలిజనులవంక
కాలువలుకట్టినా
చెమట వరదలవంక
చూచితే చాలురా !
గుండె నీర్కారురా !

దేవాలయంబులో
నిర్జీవప్రతిమలో
లేదురా ! దేవుండు
లేదురా !! లేదురా ? !!
మడిగట్టినానని
నను ముట్టుకోకనీ
ముక్కుగట్టిగమూసి
చేసే జపాలలో
లేదురా ! లేదురా !!
చెమట కాలువగట్టి
కాయ కష్టము చేయు
కూలివారలమధ్య
కాన్పించు కనువిచ్చి
చూడరా ! చూడరా !!

శ్రీనివాస చక్రవర్తి బి. ఏ.

# కన్నీరు

1. కూలివాళ్లమని
మాలవాళ్లమని
తూలనాడిమమ్ము
కూలదీస్తే మాకు
కన్నీరు మానుంచి
కడవలై కారింది!

2. పొలము పనులచేసి
మొలకలెన్నో పెంచి
వెలలేని ఫలమెంతో
కొలతలేకను దీస్తె
చాలగాతినిమీరు
చీలదీస్తేమమ్ము. కన్నీరు.

3. కసవు చాలా తెచ్చి
పసుల నెన్నిటొ పెంచి
మసకలేని పాలుమీ
కోసమని తెస్తే
రుసరుసలు పడితాగి
కసురుతుంటేమమ్ము. కన్నీరు.

4. కండలన్నీ మేము
పిండిచెమటలు కార్చి
దండిగమిము మేపి
వుండగంజీ లేక
ఎండిపోయినగాని
అందజూపకమమ్ము
దండింపజూస్తేనూ. కన్నీరు.

5. చదువుశాలలు మేము
పొదుపుగా కట్టేసి
అదురు బెదురూలేక
ముదముతో మీకిస్తే
చదువులన్నీ చదివి
చవటలమము చేస్తే. కన్నీరు.

6. ఎత్తుమిద్దెల్లోన
మత్తుగమిము మేపి
మెత్తపాన్పులపైన
చిత్తమొప్పగపెడితే
పిత్తబలిసిమమ్ము
ఎత్తిపొడిసీతేనూ. కన్నీరు.

శ్రీ కృపాలినీ.





# రైతు జాతి

తాత తాతలనాటినుంచీ
రీతిరీతుల మానవులనూ
చేతిమీదుగ పెంచిదించిన

జాతి నాదేనోయ్ !

దేవుడంటూ దెయ్యమంటూ
చావుకబురు లెవేవొ జెప్ప
తీవితోగూర్చుండ పురోహిత

జీవినేగానోయ్ !

దేవునంశతో జన్మమెత్తిన
జీవినంటూ బీదజనులను
చావగొట్టుచు రాజ్యమేలే

భూవిభుడగానోయ్ !

చచ్చుదేవుడు పుచ్చుమతమూ
హెచ్చుతగ్గుల కులవిభాగము
చచ్చిపోయేదాక నూరట

జెందనే లేనోయ్ !

రైతుదే యీరాజ్యమంతా
కూలిదే యీ రాజ్యమంతా
రైతు, కూలీ హక్కుదారులు

రాజ్యమునకిపుడోయ్ !

గొట్టిపాటి సుబ్బరాయులు.

# చెప్పండయ్యా న్యాయం !

కోడికూతకు__మేము లేచి
పక్కబట్టలు _ బుజానవేసి
గుక్కెడు గెంజి__డొక్కలనింపి
సుత్తీకొడవలీ _ చేతాబట్టి
రోహిణి గాడ్పుల్లో-యెర్రటియెండల్లో
మాఘమాసపు _ ముద్దచలిలో
__నాదు పెళ్లాం
__ నాదు కుర్రడు
నేనూకలసి__
చేతుల రక్తం--చిమ్ముతువున్నా
మేనులు చెమ్మట--కారుతువున్నా
మాడుతువున్న--డొక్కలతోటి
లోతుకుపోయిన--కన్నులతోడ
కంగ్--కంగ్--కంగ్--
మంటూ--
వంచిననడుమూ--వంచినట్టుగా
నల్లనిరాళ్లూ--నలిపెదము.

.....................

రేయింబవలు--భేదంలేక
ఎండావానా--భేదంలేక
పురుగూ పుట్రా--భీతీలేక
రాయి రప్పనూ--సరకూ గొనక
ముల్లూ ముట్రా--మూటా తలవక
మలమలమాడ్చే--యెర్రని యెండలా
పైరులన్నీ--కోసెదము.

.......................

కటికీరాళ్లూ__పగులాగొట్టి
మాదుయెముకలు--పొడుము చేసి
వేడిరక్తము--ధారగబోసి
కట్టియిచ్చిన__మేడల్లోకి
పోవడానికీ__హక్కే లేదా ?

....................

కష్టంసుఖం__భేదం యెరుగక
సుళువూబరువూ-సూత్రం తెలియక
వాయినికట్టి _ కడుపునుకట్టి
రెక్కలు ముక్కలు- చేసుకు మేము
మేనుల చెమ్మట _ ధారగపోసి
ఫలింపజేసిన__ పంటలు మేము
తింటే దొంగలమా--

....................

యెందరో--బీదల
కడుపులు--కొట్టి
నోటిదగ్గర--ముద్దలు తీసి
కొంపలుతీసి--గుల్లలు చేసి
ధర్మాధర్మం _ మాట తలవక
న్యాయాన్యాయం-మరచినారు
తాతతండ్రులు
కట్టివుంచిన--
మేడల్లోను
బొజ్జలు నిమిరుచు
కాలుమీద--కాలువేసి
పైరాయిస్తారా-?

విష్ణు.

# యుద్ధం !

యుద్ధం ! యుద్ధం !
విహంగాలవలె విమానములు
వియత్తలమున విహరిస్తాయి !
చీమల బారులు సైన్య నివాహములు
భూమంతానూ పోగడుతాయి !
మరఫిరంగులూ, మర తుపాకులూ
మందుగుండు సామానులతోడను
యుద్ధం ! యుద్ధం !

వీరపుంగవులు విమానము లెక్కీ,
బాంబుల వర్షం ప్రారంభించీ,
విషవాయువులను వినియోగించీ,
నీతీజాతీ నియమం లేకా
ధర్మాధర్మ విచక్షణ లేకా
పిన్నా పెద్దా భేదంలేకా
అనపరాధులను, అమాయికులనూ
అన్యాయంగా ఆహుతిజేసే
యుద్ధం ! యుద్ధం !

రాజ్యకాంక్షయే రవులు కొన్నదీ
మనుష్యత్వము మాడిపోయినది
దిక్కులుచూచే దేవుడు కూడా
జీవములేని శిలయైపోతే
మానవజాతికి మతి పోయిందా ?
యుద్ధము నాపే యోచనలేదా ?
యుద్ధము నాపే యోధులులేరా ?
యుద్ధం ! యుద్ధం !

పెనుమర్తి కామేశ్వరరావు.



నెల్లూరు వెంకట్రామానాయుడు

ఆంధ్ర జమీన్ రైతు నాయకులు



గోగినేని లక్ష్మినారాయణ

5వ భారతీయ స్వాతంత్ర్య సమరంలో కారా

గారంనకు ప్రప్రథమున వెళ్లిన రైతు నాయకులు

16B



లావు అంకమ్మ
ఆంధ్రరాష్ట్ర రైతుసంఘ ఆర్గనైజింగ్ కార్యదర్శి

నన్నపనేని వెంకట సుబ్బయ్య
గాయకుడు; గుంటూరుజిల్లా రైతునాయకుడు
అం. రా. రైతుసంఘ ఆఫీసు కార్యదర్శి

యుద్ధం యుద్ధం
ప్రచండయుద్ధం

1\. మరఫిరంగుల
మారణయుద్ధం
రక్తపాతముల
చూచేయుద్ధం. యు.

2\. గాలివాడల
ఘోరునయుద్ధం
విషవాయువులను
నింపేయుద్ధం. యు.

3\. బాలవృద్ధులను
చంపే యుద్ధం
మానవకోటిని
హతమొనరించే. యు.

4\. యిట్టిజ్వాలలు
యూరప్ అంతా
నిండివున్నవి
నేటిరోజునా. యు.

చేపూరి రామమూర్తి.

* * * *

యుద్ధం యుద్ధం యుద్ధం
ప్రళయభీకర నృత్యంచేస్తూ
తుపానువడిలో గిర్రున తిరుగుతు
వచ్చిందీ ; వస్తుందీ ! యుద్ధం యుద్ధం.

పొట్టకూటికి సైనికులయినా
బీదవారల నెత్తురుటేరులు
బారులుగట్టి తీర్చేటందుకు
వచ్చిందీ ; వస్తుందీ ! యుద్ధం యుద్ధం.

కర్షకావళీ కష్టమంతా
కూలివారల రెక్కలకష్టం
మారణహోమం అయ్యేటందుకు
వచ్చిందీ ; వస్తుందీ ! యుద్ధం యుద్ధం.

ధనికవాదుల స్వార్థ్యమంతా
సామ్రాజ్యవాదుల రాజ్యాలన్నీ
పెరిగేటందుకో తగిగేటందుకో
వచ్చిందీ ! వస్తుందీ ! యుద్ధం యుద్ధం.

తల్లీ తండ్రీ తిన్నగ తెలియక
పాలకోసమై పాకేశివును
విషవాయువు కెర చేసేటందుకు
వచ్చిందీ ; వస్తుందీ ! యుద్ధం యుద్ధం.

జి. యస్. అరి.

## ఓ బీదవాడ !

1. ఉత్సాహినై రక్త
మడిగించుకొంటావు
జీవకళ నశియించి
శిధిలమయ్యావు
అంతలో నీదృష్టి
అంతరించిందీ
ఓ పేదపనివాడ !
ఓ బీదవాడ !!

చదువుకొని జ్ఞానమ్ము
సాధించు వయసులో
కడుపుమంటతో వాడి
గడప, గడపకుతిరిగి
ఈసడింపులువింటు
వెర్రి మొగ మేసుకొని
అర్థమ్ము తెలియన
ట్లల్లాడుతూనీవు

2. మసక చీకటిలోన
మలిన వస్త్రాలతో
మసలుతూ తిరుగాడు
పసి హృదయమా !

పేదచూపులు చూస్తు
కదలిపోతావు
అంతలో నిట్టూర్చి
ఆవలిస్తావు ॥ఓ పేద॥

చదలవాడ పిచ్చయ్య.

## ఏమి న్యాయంబోయి దేవా!

ఏమి న్యాయంబోయి దేవా!
నీవింక
యెందుకున్నట్టోయి దెయమా!
పలుకష్టములజెంది పంట బండి స్తేను
కడుపునిండదు మాకు గాదు లెవనికో నిండు. యేమి.

దినము కిరవైఘంటలనకుండ పనిజేసి
తినుటకన్నములేక తికమకలు పడుతుంటె
పనిలేని సోమరుల యినుపపెట్టెలు నింపి
ఘనుడనంచు రధాల కల్యాణమూరేగు. యేమి.

ఆకలాక లటంచలమడిస్తున్నారు
చింపిగుడ్డలులేక చింతపడుతున్నారు
అప్పులోళ్లతో చాల ముప్పుబడుతున్నారు
చెప్పుకుందామంటె చిక్కకుండున్నావు. యేమి.

"బూర్జువా" మేడల్లో పొర్లాడుతావా!
"రోల్సు రోయిల్సు"లో రోగివైనావ?
వైమానికాలలో వగలుబడతావా?
అసలు నీయునికియే అనుమానప్రదమ? యేమి.

గొట్టిపాటి సుబ్బారాయులు.

# ప్ర కృ తి క న్య

దృశ్యము — ప్రకృతి కన్యా స్వయంవరము. ప్రకృతిబాల కేలగుసుమ మాల. ప్రక్క చెలినిలుచుంటుంది గంధపుగిన్నెతో.

చెలి : — సభికుల నుద్దేశించి.

కుడవగూడును గట్టగుడ్డనిచ్చెడువాడు
నకలుపారంభుడైనట్టి మన్నీడు. నా
చెలియప్రేమను గొనజెట్టి యాతండు. దే
శీయ సౌభాగ్యమే స్వీయభాగ్యంబుగా
దలవంచి పనిచేయగల ధైర్యశాలి.
తనగొప్ప దాజెప్పుకొనిన ధీశాలి నా
చెలియప్రేమనుగొన్న జెట్టియాతండు...
అతనికీ చర్చయీయాయలరు దండయునుమా
చెలియ సమ్మనముతో చేర్చియర్పించు.
అర్వాలెవ్వరో లేచి యరుదెంచుడయ్యమీ
కొలదులేమో చెప్పుకొనదగునయ్యా...

షాహుకారు : — (లేచి దగ్గరించి)

పేరుమోపిన షాహుకారు నాపేరు నా
యూరు (అర్ధోక్తిలో)

ప్రకృతిబాల : — (క్రోధముతో)

కూడుగలిగించేదినీవా? లోకంపు
గోడు గమనించేదినీవా ?...
ఇనుపమందసములన్ ననుబెట్టి బంధించి
నా స్వేచ్ఛ నరికట్టు నీ స్వార్థపరతకై

ఆత్మబలి నీ జాలనోయీ ధనికుడా
అతిదూరమందుండు మోయీ... ||కూడు||

పూర్వాచారపరాయణుడు :_ (లేచి)

దైవకృపచే సర్వధర్మవిజ్ఞేతనై
ఆర్యమతమునకు దార్ఢ్యమ్ము చేకూర్చి, పూ
ర్వాచారములకు దోహదము గావింతునే_ (అర్ధోక్తిలో)

ప్ర కృ తి బా ల

ప్రకృతిబాల: _ ( కండ్లు గీటుచు )

నోరువాయియులేని కారురాయిని నిల్పి
దేవుడని నమ్మించి పావనతగల్పించి
వానిచాటున నీకు వర్తనము మాటుకొని
పురపకారంపు పెంపునకు వేర్పురుగువై
ఐకమత్యారోగ్యమడచు పెన్వ్యాధివై
కులభేదములు చూపి కూల్చితివి నెయ్యమును
మత భేదములతోడ మాడ్చితివి సంఘమును
దేశ సౌభాగ్యమును నాశమ్ము జేసితివి
కూడుగలిగించేది నీవా? లోకంపు
గోడు గమనించేది నీవా?
కైతవోద్యోగివే,
కలుష వర్తనుడవే,
నిన్నెట్లు వరియింతునోయీ నీవు
అతిదూర మందుండు మోయీ ||కూడు||

జమీందారు (లేచి)

అఖిలభోగంబులకు నాలవాలమ నేను.
సుఖసంపదల కధీశుడను, రాజాను, నా
గోటు, నానీటు, నానూటు గర్వోనుము ని (అఘోక్తిలో)

ప్రకృతిబాల (అసహ్యముగా)

రైతు కన్నీటిధారల తారహారాల
నన్నలంకృతజేసి మన్నించెదవుకదా
పేదసంసారిహృద్వేదనా మిళితమా
నీతుచ్ఛవైభవోపేత గావించెదవె.
కాలుష్యమైన నీ కౌగింటజొన్చి, నా
సహజ సౌందర్యాన్ని చంపేసి, కృత్రిమా
లంకారముల మేడపంకాలనీడ న
న్నాదరించెదనంటివా ? భ్రమసి, యా
మోదింతుననుకొంటివా ? కత్రినుడా
నీనీడ నీజాడ రానీకు, కనరాకు. ॥కూడదు॥

## ప్రకృతి కన్య

ప్రకృతిబాల విసికికొనిపోవుచు, త్రోవను జనుకర్షకుని జూ-
చి, సమీపించి, యాదరముతో)

కంటినిండానిద్ర వంటినిండాగుడ్డ
కొరవడిన సుఖముతో అరపూటగంజితో
చెట్టుపుట్టయుగొట్టి చేనుసేద్యముజేసి,
పంటపండించేటిరేడా దేశసౌ
భాగ్యమెనయించు రైతా !
రావోయి, రావోయి, శ్రమికుడా హృదయ

మావాసముగగొమ్మ శ్రమికుడా...
బక్కచిక్కిన రెండు దుక్కిటెద్దుల రథము
గోటేరుబూన్చి, గోగణమునదలించి
అకలుషప్రజ్ఞ గార్మిక పటాలముగూర్చి
దిగ్విజయము గొన్న శూరా నాకు
తోడునీడవుగదా కర్షకా
నీకు వెన్నెముకగా
నీగుండెబలముగా
నీకు రక్షకినిగా
నీకు ఛత్రమునుగా
నీపాదరక్షగా
నీకు గవచమ్మునై, నిర్వహించెదనన్ని
రావోయి రావోయి కర్షకా హృదయ
మావాసముగగొమ్మ కర్షకా
కూడుకలిగించేది నీవేకా ? లోకంపు
కోడుగమనించేది నీవెకా ?

అయ్యపు వెంకటకృష్ణయ్య.



## ఊర్కుంటామా ?

1. ధనికుల మంచూ
గర్వముపాలై
బీదల సాదల
కన్నుల గొనక
నడవడి చెరుపుకు
పాడౌతారా ?

2. రైతూవాళ్లం
కూలీవాళ్లం
గౌరవ పదవికి
తాహతులేదని
తలచుటదేలా ?
చెట్టుకువేళ్లూ
బాగావుంటే
దాని ప్రభావం
వెలుగుతువుంటే
వేళ్ల సహాయం
తెలియనె తెలియదు.

3. గాంధీగారూ
నెహ్రూగారూ
వున్నారంచూ
భారం అంతా
వారికె యిచ్చి
చూస్తూపూరక
కూర్చుంటామా !

4. ఉడతా భక్తి
చొప్పున మామా
శక్తులబట్టి
మనమున మంత్రం
చదువక నడుముకు
బట్టాకట్టక
వూర్కుంటామా!

పిల్లలమర్రి.

# చంద్రునకొక నూలుపోగు.

ఉదయశిఖరాగ్రాసనముపై
వదుగొ చంద్రుడు చిగురుపెదవుల
కొదమనవ్వుల నొలకవోయుచు
కూరుచున్నాడు.

*　　　*　　　*　　　*

పంటపైరులు నాస్తియై పూ
రింటిలోములు గ్రమూలిడి
కర్షకుండదె కూలబడ్డాడోయ్ !
　　సుధచిందునీక్రీ
గంటితోనటు తొంగిచూడగదోయ్ !

*　　　*　　　*　　　*

కష్టపడి పగలెల్ల చివరకు
కడుపుమంటకు తిండిచాలక
కార్మికుడు కడుబడలి యున్నాడోయ్ !
　　నీ చల్ల చల్లని
కరములతో లాలింపగా గదవోయ్ !

*　　　*　　　*　　　*

చెమటోడ్చి పనిచేసి చేసీ
చెట్టునీడల పట్టినేలల
శ్రమికవర్గము పండుకొన్నారోయ్ !
　　చంద్రయ్యా తండ్రీ !
అమృతకణముల చిల్కరింపగదోయ్ !

రాజువట్టు ద్విజరాజువటనీ
రాజభామా జూపవా! పోయి
రాజరాజని బీదలున్నారోయ్!
సుస్నేహమున సుఖ
రాజితో వాజిల్ల జేయగబోయ్!

*  *  *  *

మిట్టపల్లము భేదములుభూ
మట్టమై సర్వమ్ము సరియై
పండువెన్నెల లోకమంతా
నిండిపోవాలోయ్!

*  *  *  *

శ్రీ భరద్వాజ.



## రైతు ఆలాపము

పొద్దున్నె లేస్తాము, సద్దికడితింటాము,
ఎడ్లన్ను తోలూక, సేద్దానికెడతాము,
కూలీనాలీజేసి కష్టించెదముగాని
మనకష్టములకేల అంతులేదోయీ !

*  *  *  *

ధనవంతులందరూ విద్యాలు నేర్చారు
పేదోళ్లనందరిని బాధింపజొచ్చేరు,
తెలివిగాంచక మనము సోమరైయుంటేను
తొలగదూదాస్యంబు కలుగదూస్వేచ్ఛ !

*  *  *  *

పన్నుభారంచేత పస్తుపడియుండెగా
ఋణబాధలెక్కువై గాసిల్లుచుండగా
పేదలనుదోచేటి పాపిసంఘమెుకింత
కరుణ మనపైలేక కష్టపెడుచుండగా

*  *  *  *

సామ్యవాదుల మంచు సొంపుగా బల్కెదరు
ధనికతత్వమెకార్యరూపమున జూపెదరు
పేరుగౌరవములకు ప్రాకులాడుచు మనల
మోసగించెదు ధనికులకు ప్రేమలేదోయి

*  *  *  *

బీళ్లనుదున్నేము, రాళ్లనుగొట్టేము
పచ్చన్ని పంటలచె, ఫలవృక్షములచేత

ప్రకృతినంతను కనులపండు వొనరించినా
ఆనందజీవితము మనకేలలేదోయ్.

*　　*　　*　　*

దారిద్ర్యజీవులై దాసానుదాసులై
జీవచ్ఛవమువోలెధరను బ్రతుకుటకంటె
ఎర్రజండా నెత్తి స్వాతంత్రసమరమున
స్వారాజ్యమునుపొంది సౌఖ్యమందూదాము.

*　　*　　*　　*

కూలీల కష్టాలు సమసిపోవాలంటె
రైతుల బాధలు అంతమొందాలంటె
సామ్రాజ్యవాదాన్ని ధనికవాదాన్నంత
కనికరింపకమనము కడతేర్చవలెనోయి

*　　*　　*　　*

రైతురాజ్యము మనము స్థాపించినంతనే
కూలిరాజ్యము మనము స్థాపించినంతనే
కలిమిలేములు సమము కష్టసుఖములు సమము
ఆనందజీవులై సౌఖ్యమందూదాము.

కే. వి. రామకృష్ణారెడ్డి.



# ఘోరము ఘోరము (కూలీల ఆర్తనాదం)

ఘోరము ఘోరము
దారుణ మెంతయు
కూలికి జేరిన
బాధోపరించుట
జీతపుకోతలు
మెండుజేయుట
నష్టకష్టము
కూపై ద్రోయుట
లాభమునంతయు
మీలోపంచుట
ఇష్టమువచ్చిన
డిస్మిసుచేయుట
తప్పులులేకనె
శిక్షోపరించుట
పగలూరాత్రీ
పనులను జెప్పుట

రోగముమాకును
రాదని నమ్ముట
ఫేక్టరిలోపల
డాక్టరులేడట
న్యాయము ధర్మము
గానకపోవుట
గర్భిణిస్త్రీలకు
శలవులు లేవట
కూడుయుగుడ్డలు
సరిగా లేవట
చీటికిమాటికి
పోలీసు ఓల్చుట
కార్మికసంఘపు
సలహా వినరట ఘోరము.

మోటామర్రి జగన్మోహన్,



## బీ దా సా దా

ఉందామంటే వూరూలేక
తిందామంటే తిండీలేకా
కొందామంటే పైసాలేకా
కూర్చున్నామోయ్
తండ్రీ!
కుములుచున్నామోయ్!!
రెక్కలన్నీ విరుచూకోనీ
రక్తమంతా ధారవోస్తే
ఒక్కరోజైనాను సరిగా
డొక్కనిండదోయ్!
తండ్రీ!
పక్కనిండవోయ్!

కూచోటానికి కొంపలేదు
మాపాణాలకి సుఖమేలేదూ
రాకాసీలోకాము మమ్మూ
కూకలేస్తుందోయ్
తండ్రీ!
కేకలేస్తుందోయ్;
ఎండిపోయెను నరములన్నీ
ఇంకిపోయెను నెత్తురంతా
క్షామదేవత మాగుడిసెలలో
కాలుపెట్టిందోయ్!
తండ్రీ!
గజ్జెగట్టిందోయ్!

శ్రీ భరద్వాజ.

## క ష్ట జీ వి

ఆకాశమధ్యాన అల్లాడుచున్నాడ
ఆదిలేదూ అంతుకనపడదూ
కూలిబాగున్నాది కూడులేకున్నాను
రక్తమిస్తున్నాను భుక్తికరవయినా. ఆ.
తిండితింటున్నారు మండిపోతున్నారు
ఉండవోయంటారు చండాలుడంటారు ఆ.
రక్తమంతాతాగి శక్తిబాగాకలిగి
తన్నగలమంటారు తన్నుతుంటారు. ఆ.
నీసోదరుడ నేను నాసోదరుడ నీవు
నీకు స్వర్గంబేమి ? నాకు నరకంబేమి ? ఆ.
కష్టమంతయు నాది పుష్టియంతయునీది
పండడం నావంతు తిండి నీవంతా ? ఆ.

జ గ న్నా ధ్,

# జయలక్ష్మి.

జయలక్ష్మిలా ! జగజ్జనని భారతమాత
జయపెట్టరా ! నీదు జన్మభూమికి నేడు

1. నడువరా ! ముందునకు
నడికట్టు బిగియించి !
అడుగరా ! నీజన్మ
హక్కు స్వాతంత్ర్యమును ! జయ.

2. తెపరా ! తీవ్ర జా
తీయ మతకక్షలను !
దింపరా తెర, భావ
దాస్య నాటకమునకు ! జయ.

3. ఉరకరా ; స్వాతంత్ర్య
యుద్ధరంగమునందు !
నరకరా ! ప్రజల నె
త్తురుపీల్చు భూతముల ! జయ.

4. పెట్టరా ! నుదుట కుం
కుమ రక్తతిలకమును !
కట్టరా ! నీయింట
కళ్యాణతోరణము ! జయ.

5. మ్రోగింపరా ! దిగ్ది
గంతముల జయభేరి !
సాగింపరా ! నీవు
స్వాతంత్ర్య రథమునిక ! జయ.

శ్రీ భరద్వాజ.

## జయశంఖం ఊదరా

ఊదరా ! ఊదరా ! ఊదరా ! సోదరా !
ఉడుకురక్తము మేన
నుప్పొంగ జయశంఖ
మూదరా ! ఊదరా ! ఊదరా ! సోదరా !

పేదరైతుల పీక్కు
తిను పిశాచమ్ములకు
నీదివ్యజయశంఖ
నాదమే జాగంట. ఊ.

పాటుపడి పనిచేయు
ప్రాల్మాలు సోమరికి
నీదివ్య జయశంఖ
నాదమే ములుగర్ర

కాయకష్టము చేయు
కార్మికావళికెల్ల
నీదివ్యజయశంఖ
నాదమే చేయూత. ఊ.

మాతృపూజాదీక్ష
మాంగళ్యమూర్తులకు
నీదివ్య జయశంఖ
నాదమే నవశక్తి. ఊ.

దేశసేవారంగ
మున, దుముకు యువకులకు
నీదివ్య జయశంఖ.
నాదమే స్వాగతము. ఊ.

శ్రీ భరద్వాజ.

## స్వర్గము యిదేకాదా

కార్మిక జనులు
కర్షక జనులు
కష్టాలు మరచి
కాయకష్టం
పంచుకుంటే
స్వర్గమంటూ వేరేవుందా ?
స్వర్గమంటే ఇదేకాదా ?
కులబేధాలు
కూలిపోయి
లోకమంతా
ఐక్యమైతే. స్వర్గ.

తాడిమల్లు బసవరావు.



శ్రీమతి భారతీదేవి

ఆంధ్రరాష్ట్ర రైతుసంఘాధ్యక్షురాలు

అఖిల భారత కిసాన్ సభ సంయుక్త కార్యదర్శి

32B



స్వామి సహజానంద సరస్వతి
అఖిలభారత కిసాన్ సభ అధ్యక్షులు. 3 సం.
కఠినశిక్ష విధించారు. ఇండియా చట్టం క్రింద



బాబా సోహన్‌సింగ్ భాక్నా
అఖిల భారత కిసాన్ సభాధ్యక్షులు: డిఫెన్సు
చట్టం క్రింద కారాగారములో ఉన్నారు.

## దేశమిల్లేయుండునా ?

దేశమిల్లే యుండునా, కర్షకా ఆనాడు
దేశమిల్లే యుండునా ?
నీశక్తిని నీవెరింగిననాడు ములుగర్ర
పాశుపతాస్త్రమై పరవళ్లుద్రొక్కదా ?
విప్లవాగ్నిచ్ఛటల్ ధ్యాన గమ్యంబులై దేశ.

కనుబొమల్ ముడివైచి రణమునకురముజూచి
నీవ విజృంభించి నిర్వహించెడునాడు
తేరిచూడఁలి శక్యమా ?
ప్రళయార్కుఁ తేజంబుటిందువడదా ? దేశ.

మరఫిరంగులదాటి మరపించునాగేటి
తిరుగుబాటున కెందు తిరుగువాటున్నదా ?
జీవసంచయమునకు జరుగుబాటున్నదా ? దేశ.

విజయలక్ష్మీ కర జలజమాలికలచేత
నీవ నీలంక్రుతుడవై నొతవా ఆనాడు.
ధనికేతరుల పరిత్రాతలా ఆనాడు. దేశ.

కాయకష్టమునకు గలిమి చేకురునాడు
కష్టపడువానికే గౌరవముగలనాడు,
ధనికవాదము యింకదాగ, తావున్నదా ?
కుటిలనీతిజ్ఞులకు గుడువగూడున్నదా ? దేశ.

అయ్యపు వెంకట కృష్ణయ్య.

# నీబలము నీవెరుగవా ?

నీబలము నీవెరుగవా
ఓ రైతుబిడ్డా. నీ.

నీలోనిరక్తాన్ని నీవుశోధించితే
నీకునీకే అంత తెలిసిపోతుంది. నీ.

నీవు జన్మించినది భరతాంబగర్భాన
నీకుసాహసమున్న నీ జన్మహక్కు. నీ.

మాయమాటలు చెప్పి మనల నేడ్పించేటి
నాయకులపై ఆశనీకేలనన్నా నీ.

తమలాభమాసించి ధనవంతులీనాడు
తప్పుద్రోవల ద్రోయదయజూపుతున్నారు. నీ.

నిన్నుదోచుకుతిను నీదుశత్రువెట్లు
నీమేలుగోరెదరో నీవె యాలోచించు నీ.

నీలోని నూతనోత్తేజమున కదిరియే
నీకు ద్రోహముచేయ నీపాలబడ్డారు. నీ.

ఇప్పుడిప్పుడె నీలో యిగురెత్తుచుండేటి
స్వాతంత్ర్యజ్వాలను చల్లారబోనీక. నీ.

పరులపంచలజేరి ప్రాకులాడుటమాని
నీదుపాదాలపయి నీవు నిలుచుండియే. నీ.

గుడ్డేటి వీరసుబ్రహ్మణ్యం.

# నిద్దురలేవోయ్ కర్షకుడా ! కార్మికుడా !

రైతుల పైబడి
రక్తము త్రాగే
బీదసాదలను
విరుచుకుమ్రింగే
వడ్డీదయ్యపు
కాళ్లుచేతులను
నీ గొడ్డలితో
నరికెయ్యాలోయ్ !
నిద్దుర లేవోయ్ !
కర్షకుడా !!
నిద్దుర లేవోయ్
కార్మికుడా !!
ధనికతత్వమూ
స్వార్థపరత్వము
బిగుసుకుపోయిన
బీటిబిళ్లలను
పాదుకుపోయిన
పాటిదిబ్బలను
నీ నాగలితో
దున్నెయ్యాలోయ్. ని.
కొంపలు గోడులు
గుల్లలు చేస్తూ
తలవిరబోసుక
తైతకలాడే

మద్యపానమను
మహారాక్షసిని
నీ పలుగులతో
పొడిచెయ్యాలోయ్. ని.
కార్మికవర్గము
కండలుకొరికే
కర్మాగారపు
కఠినచట్టముల
యంత్రాలయముల
హైన్యపద్ధతుల
నీగుంటకతో
సరిచెయ్యాలోయ్. ని.
జాతివైరములు
చదునైపోయిన
జాతీయతవ్యయ
సాయము చేసిన
జన్మభూమిలో
శాంతిబీజములు
నీ జడ్డిగమున
వెదబెట్టాలోయ్. ని.
పైరు పొలాల్లో
బడితెగతింటూ
రంకెలుబెట్టే
ఆబోతెద్దుల

గంతులువేసే
గంగిరెద్దులా
నీములుగర్రతో
అదిలించాలోయ్. ని.
అల్లిబిల్లిగా
అల్లుకుపోయ్యే
మూఢాచారపు
ముండ్లతీగెలను
మతవిద్వేషపు
కలుపు మొక్కలను
నీ కొడవలితో
కోసెయ్యాలోయ్. ని.
పంటచేలపై
పచారుచేస్తూ
పైపై దిరిగె
పరిగపిట్టలను
కంకులుకొరికే
కాకిమూకలను
నీవడిసెలతో
బెదరించాలోయ్. ని.
కుప్పలుబడ్డా
కులభేదాన్నీ
కళ్లాన్నేసి

నురిపిడిజేసే
భరతమాతపై
పాటలు పాడుచు
నీచేతులతో
తూర్పెత్తాలోయ్. ని.
అగ్రజాతులా
ఆత్మలోపల

అంటుకుపోయిన
అస్పృశ్యతనీ
అతుక్కుపోయిన
అంధత్వాన్ని
నీ పాలికట్టతో
తుడిచెయ్యాలోయ్. ని.
తాలూతరకా

గాలికిపోసీ
దయాశాంతులను
ధాన్యపురాసుల
బంగ్లకునెత్తీ
పాతరబోసీ
నీ గాదెలలో
నిండించాలోయ్. ని.

శ్రీ భరద్వాజ.

## కలదో లేదో

సర్వసముడయ్యో
సర్వేశుడుంటే
కొందరు కోట్లతో
కులకగనేలా ?
ఎందరో కూటికి
కుందగనేలా ? ౧.

కరుణానిధియౌ
పరమేశుడుంటే
క్రౌర్యముజగతిని
ఏలగనేలా ?
శాంతముధూళిని
దొర్లగనేలా ? ౨.

ప్రేమమూర్తియౌ
ప్రభుడొకడుంటే
ద్వేషాలెన్నో
పెరుగగనేలా ?
రక్తపుటేరులు
పాఱగనేలా ? ౩.

దీనరక్షుడౌ
దేవుడెఉంటే
దిక్కుదిక్కునా
దైన్యంబేలా ?
తల్లిబిడ్డలను
ఎడబాటేలా ? ౪.

నార్ల వెంకటేశ్వరరావు, (చిత్రగుప్త)

# మార్పే ఈ యుగధర్మము

ఎల్లప్పుడును నొకేగతి నెట్లుజరుగు?
మార్పు సర్వప్రపంచ ధర్మంబుచూడ
మనుపుటాచారములు నేడు పనికిరావు
సల్పవలయు గాలోచిత సంస్కరణలు.

గొ॥ గోపాలకృష్ణయ్య, (చిత్రగుప్త)

సీ. సంఘశక్తి నెఱింగి జనపదంబులనెల్ల
రైతుకూటంబు లేర్పరుపవయ్య
నీగౌరవమునెంచి నీచేవ బాటించి
తలయెత్తి దీనతం దలపవయ్య
వెరపుదవ్వగ జోపిదొరల పజ్జకుజేరి
నీగోడునెల్ల విన్పింపవయ్య
నీమేలుగోరి నీనేతలిచ్చు తురాయి
పూదంపవలె దలంబూనవయ్య



తే. సాటిదేశాల కాపుల జాడలరసి
నేడు నీకర్జ మెద్దియో నూడవయ్య
ఉమ్మలిక లెల్లకాలంబు నుండబోవు
చింతపడకయ్య! భారత క్షేత్రజీవి.

తుమ్మల సీతారామమూర్తి.

38

## సమతాధర్మము

జయము జయము మా భారతభూమికి జయము దిగ్విజయము
జయము జయము మన రైతుకార్మికుల జయము దిగ్విజయము
ఆదికాలమున అందరుజనులు __ అన్నదమ్ములండీ
నదులు వనంబులు నానామృగములు __ నాల్గు సంద్రములు
కొండలు వండలు జలములు పొలములు __ కుంటలు సెలయేళ్లు
కాయలు పండ్లు పాడిపంటలు __ ఘనమయినా యిండ్లు
అంతరువులా ఖేదములేక __ అందరిసొమ్మండి
కుదువాగట్టా వొకరికిబెట్టా __ కొదవే లేదండి
నా నీ భేదములేక లోకము __ నడుస్తు వుండేదీ
మనసులోపలా చీకుచింతలు -- మందుకైనలేవు
తొత్తుల దొరల భేదములేని -- తోడుబంటులండి
అందలమెక్కే మోసే భేదము -- లసలే లేవండి. జయ.

ధనికుల పేదల తారతమ్యముల్ __ తలలు జూపలేదు
అరుకువ ఆకలి బాధలప్పుడు -- అంకురించలేదు
ధనమును గొల్చే దుష్టరోజులు -- దాపరించలేదు
తిరిపెము కొరకై ధనికుల బీదలు -- దేవురించలేదు
కూటికి గుడ్డకు గుడ్డికుంటలు -- గోడుజెందలేదు
మాపులు రేపులు మలమలమాడుచు __ మాలలెండలేదు
భోగ్యములొక్కట వస్తులొక్కట __ పొందియుండలేదు
దొరలు మత్తులై నీచభోగముల __ దొర్లుతుండలేదు
పాటుపడడమే పరువుతక్కువను -- భ్రాంతిగా పడలేదు. జయ.

కృతయుగమందలి ధర్మములెల్ల __ క్రిందుమీదుగాగ
పాపముతోటి కలియుగమంత __ పండిపోయెనండి

పాపధర్మములు లోకమంతట పరిసిపోయెనండి
యెక్కడజూచిన పోటీలండి--యెక్కడ కలవరమె
పరుగిడుకాకులు యిండ్లమీరుగా పార వెరచునండి
యెంగిలిచేయి కాకులవైపు--విసరదు యిల్లాలు

ధనికులు బొర్రల నిమురుకొందురు--తలప రోకరిబాగు
చేతులవ్రేళ్లను పనులుముట్టక--చెడి సోమరులయిరి
కాలిమీదనే కాలువేసుకొని--కాలంబుచ్చేరు
లోకమందున చక్రవర్తియై--లోభుడేలుచుండు

లోకములోని ద్రవ్యమంతయు--లోభులపరమయ్యె
అంతానాదే అంతానాదే--అందరు జనులంతా
అంతామనదే యనెడు రోజులు అంతరించెనండి. జయ.
యెవరోకొందరు అరువుకొందరు__యెల్ల ద్రవ్యములను

కోటికొక్కరై వున్నారండి--కోటీశ్వరులంటు
కుచేలులందరు అయినారండి__కోట్లకొలదిగాను
కోటీశ్వరులకు పుట్టేబిడ్డలు--కోట్లకు కర్తలట
మనుమలెగాదు మనంతరాలు--మారుహక్కులంట

అరువుజెప్పితే అడ్డగకూలి--పనికి పాతికెంట. జయ.
భాగ్యవంతులకు బీదలెల్లరు--బానిస లయినారు
పొద్దుగూకులు చాకిరిజేస్తురు--బొక్కెడు కూటికిగా
యెంతజేసినా తృప్తిలేదయా యజమానులకెల్లా

రోగంరానీ నొప్పిరానీ--నాగాదప్పదయా.
కూలికి విలువగలదని మీరు__గుట్టుతెలుసుకొండి
కూలికిదగిన విలువబుచ్చుకోనే--కూలికి మరిపొండి
నీళ్లకూలికి వొప్పుకొంటిరా--నెనరు జెరుపుకొంద్రు జయ.

పనివాండ్రందరు యేకమయితిరా--ప్రపంచమే మీది
ఐకమత్యమే అన్ని పనులకు--ఆధారమునుండి
కొట్టావద్దూ తిట్టావద్దూ--కోర్కెలు నెరవేరుక
అసహాయయోగము తరుణముచూచి--అవలంబించండి

దానికిమిగిలిన మంత్రతంత్రములు--ధరలో లేవండి
శంకలుదక్కి మీరలెల్లరు--శపథము జేయండి
సమతాధర్మం ప్రపంచమందున--స్థాపింతురుగాని

వున్నవ లక్ష్మీనారాయణ.

కార్మిక కర్షక రాజ్యస్థాపన గావించండోయ్ జయధ్వానములా

కూలీలారా? రైతుల్లారా?
డిక్టేటర్ల-నిరంకుశత్వము
అధికారాంధుల-అక్రమ చర్యలు
జమీందారుల-సంపదంధత
సుత్తీ కొడవలి ఎత్తేవరకే కా. క.

రక్త పిపాసుల-రక్షస కృత్యాల్
భూమీ ధవుల-పశు ప్రవృత్తి
కోటీశ్వరుల-క్రూర పద్ధతి
ఎర్రబావుటా-ఎత్తె వరకే. కా. క.

లంచ గొండుల-గదమా యింపులు
పోలీసోరి-పురమా యింపులు
పాలక జాతుల-ఫిరంగి దెబ్బలు
పీడిత జాతులు-జయధ్వానముల
ఎర్రబావుటా-ఎత్తే వరకే. కా. క.

"శెట్టిపల్లి"

## సంఘం ! సంఘం !

సంఘుం సంఘుం ధనికులసంఘుం
దరిద్రజాతిని తరిమేసంఘుం
స్వలాభమునకై సర్వశక్తులా
మానవజాతిని మార్చేసంఘుం
నీతిరక్షణని జాతినిదెచ్చి
దోపిడి చేసే తుచ్ఛపుసంఘుం

జీవితవృద్ధికి దేవుడెదిక్కని
ఆత్మవృద్ధినీ ఆపేసంఘుం
వేద మెమతమని విప్రుడెబ్రహ్మని
కర్మతో మనల కాల్చేసంఘుం
పాడైపోతే ప్రపంచమంతా
బాగుపడదని పరితపించునా ?

## మాకు వద్దోయ్

హెచ్చుతగ్గుల-దొంగకల్పన
చచ్చుసంఘుం-యింక మీదను

౧ చదువుసామివి-నీవు హెచ్చని
చదువుయెరుగవు-నీవు చచ్చని
రంగుయెక్కువ-నీవు పెద్దని
కులంతక్కువ-నీవు కొద్దని. హెచ్చు.

మాకు వద్దోయ్-మాకు వద్దోయ్.

౨ యెండవానల-యెండితడిసీ
పిండినెత్తురు-పంటబెట్టి మా.
పంటనే-తెగదింటుమళ్లీ
నీవు నీగ్రో-నీవు మాలని
నిర్ణయించే యెక్కువేలిక. హెచ్చు.

3 మనిషి మనిషి-మధ్యనిల్చి
మాయవాదం-మతంకూర్చి
సహజబంధం-సోదరత్వం
నెత్తురొలుక-నరికివేసే. హెచ్చు.

ముద్దుకృష్ణ (జ్వాల)

## కూలీల రాజ్యం

కూలీవాళ్లము మనము, కూలీవాళ్లము మనము
కూడుగుడ్డాలేక కూలీపోతున్నాము కూ.

మేడాలు గట్టేము మిద్దేలు వేశేము
కూకుండుకైనాను, గుడిసైన లేదండి కూ.

మిల్లులు గట్టేము, శెల్లాలు నేశేము
భార్యకైనా బాబు బట్టింత లేదండి కూ.

శేనూలు దున్నేము శెట్లను నాటేము
గంజినీళ్లయిననూ కరవయ్యె మనకండి కూ.

సదువుకోసము పాటశాలాలు కట్టేము
సదువులేకా మనము సవటలై పోయాము కూ.

బేంకూలు గింకూలు పెద్దంగ పెట్టేరు
కూసింతయైనను కూలోడి కివ్వారు కూ.

సదువూలు గిదువూలు సాలాను నేర్చారు
సదువు లేనోళ్లను సంపియేస్తున్నారు కూ.

సోషలిజంవచ్చు జోహారు కొట్టాము
జోగుల భోగాలు సూర్ణమైపోతాయి. కూ.

పనిచేసే వాడేను పలమందు కుంటాడు
పాటుపడనివాణ్ని పస్తుండ బెడతాము కూ.

శక్తీ కొలదిపని రక్తీక పుచ్చూకు
అవసరమునుబట్టి అనుబవ మిస్తాము. కూ.

పైరూలు పంటాలు పండించువారికె
బూదేవి అంతాను బుక్తమైపోవాలి. కూ.

కొలుకిచ్చీబాబు కాల్మీద కాలేసి
కులికేటికామందు కూలిపోవాలండి. కూ.

ఆస్తిపాస్తులన్ని అందారి వవ్వాలి
అందారు సమముగ అనుబవించొచ్చండి. కూ.

అడోళ్ల కష్టాలు అకర్లై పోవాలి
అన్యాయమూలన్నీ అడుగంటిపోవాలి. కూ.

జాతిభేదాలన్ని సావాలి, సావాలి
కులము గిలములన్ని గోతిల్లోపడవాలి కూ.

నేతినింఢాపని నీతిగాకల్పించి
ఆకలిచిచ్చొను ఆర్పియేస్తామండి కూ.

సొంతాములన్నియు సున్నయైపోతేను
మోసాములన్నియు మాసిపోతాయండి. కూ.

సోపలిజంవచ్చు జోహారుకొట్టాము
జోగులబోగాలు సూర్ణమైపోతాయి. కూ.

పసిపాపలెచ్చోట పరవళ్లు తొక్కుతు
మురళిగానంబుల మోగించుచుంటారు. కూ.

కలకంటికోకిల కళలాను యిరజిమ్మి
మురిపెంపుపాటాల గురిపించునెచ్చోట. కూ.

రైతే రచ్చకుడయ్యి రాజ్యచక్రము నేడ
రయ్యిమంచుతిప్పు రంజిల్ల జనమూలు. కూ.

కూలోడు యేసీమ కూర్మిని కులుకూతు
పెళపెళలాడించి బళిబళి యనిపించు. కూ.

అప్పుడు శాంతము అప్పుడు సౌక్యాము
అచ్చోట ఆనంద మచ్చోట సర్వాము. కూ.

అమరరాజ్యము అద్ది అనుమాన మిదియేల
సామ్మెవాదము నాకు సామ్మె మెచ్చట బాబు. కూ.

బూలోకమందున ఆలోశనదియేల
ఈరులై తేలండి యీర సర్గముగొండి. కూ.

పందలై తేపొండి పరుగూలు పెట్టండి
సమ్మెయె సరియైన సాదనమండోయి కూలోళ్ల రాజ్యాలు
కులుకుతూవస్తాయి. కూ.

యెర్రనిబావుట యెగరాలి యెగరాలి
ఆత్మాలుఅర్పించి ఆరతులివ్వడి. కూ.

మద్దూరి అన్నపూర్ణయ్య.

## దిక్కులేదా మనకు, తెన్నులేదా మనకు

తొలగదా దాస్యంబు కలగదాస్వేచ్ఛ
మనబొమికె గూడులలో మనయెందు గుండెల్లొ
స్వాతంత్ర్యసమరాగ్ని ప్రజ్వరిల్లిందంటె. తొ.

మలమలామాడుచు మ్రగ్గిపోవుటకన్న
దిక్కులేదామనకు తెన్నులేదావేరె. తొ.

ఎన్నాళ్లు వేచినా ఎన్నాళ్లు ఓర్చినా
శాంతిలేదామనకు సౌఖ్యమే లేదా. తొ.

ముప్పొద్దులందునా మురికిమేనితోడ
పొలములోపలబడి నలిగిపోతున్నాము. తొ.

ఇంటికొచ్చామంటె ఇంతగంజైలేక
కడుపుమంటాతోడ కాలిపోతున్నాము. తొ.

తుమ్మల వెంకట్రామయ్య.

# కూ లో డ

లేవోయి లేవోయి కూలోడ.
ఏలభయపడతావు కూలోడ
మేలుకో మేలుకో కూలోడ
మేలుకొని ఎదిరించు కూలోడ.

ఎండలో వానలో
ఏనాటి కానాడు
బండ చాకిరి చేసి
బ్రతుకుతావే కాని

దినము నీకూలితో కూలోడ
తిండైనా దొరుకునా కూలోడ.

కర్మమంటూ వొకరి
ధర్మమంటావు నీ
కడుపు మాడ్చుక దొరల
కడుపు నింపుతావు

కష్టమంతా నీది కూలోడ
కలిగినోళ్లది సుఖము కూలోడ.

పండినా ఎండినా
భయమేమి లేకుండ
దండిగా నీదారకు
ధనధాన్యముల జేర్చి

పనిలేనిచో నీవు కూలోడ
పస్తే పడుండాలి కూలోడ.

దొరలు నీ చాకిరిని
దోచుకొని తింటూంటె.

తిరగబడి నీవెప్పుడు
తిప్పలెడతావో యని
కర్మమని చెపుతారు కూలన్నా
కంగారు పెడతారు కూలన్నా.

చీని చీనాంబరాల్
చిత్రముగ నేస్తావు
వాటి నన్నిటి దొరలే
వశము చేసే నీవు
జానడైనా లేక కూలన్నా
చలిలోనె చస్తావు కూలన్నా.

రాయిలా గున్నపుడు
హాయిగా చేయించి
నీగడ్డ రక్తాన్ని
నిలువునా పీల్చేసి
డీలుపడి పోగానే కూలన్నా
దగ్గరికి రానీరు కూలన్నా.

ధనవంతులని యేటి
పేదవాళ్లని యేటి
"వేదాలు" రెండేను
స్థిరముగా నున్నవీ
ఒకదాని కొక్కటి కూలన్నా
ఎప్పుడూ "పెడమొఖమె" కూలన్నా.

నాగేశ్వరరావు, లింగయ్య

# మేలుకో

మేలుకో మేలుకో కూలన్నా
మేలుకొని ఎదిరించు కూలన్నా.

నిలువెత్తు చక్రాల
జలదరించే బండ్లు
వేలకొలదీ మైళ్లు
వేగపరుగిడు బండ్లు
చీల్చికొని గాలిలో
ఎగిరిపోయే బండ్లు
పోల్చికొని నీళ్లలో
మునిగిపోయే బండ్లు!

ఏడచేశావోయి కూలన్నా
ఎట్లచేశావోయి కూలన్నా
ఎంత కష్టించావు కూలన్నా.

చిలిపి చిలిపీ బండ్లు
చేసావు గానీ
ఎన్నడైనా నీవు
ఎక్కి తిరిగావా

నీ కష్ట మెటుబోయె కూలన్నా
నీ సౌఖ్యమేమాయె కూలన్నా.

పెద్ద పెద్దల మంటు
దొంగ లంతాను

దోచి తింటున్నారు కూలోడ
ఎఱుగకుంటున్నావు కూలోడ,

ఇప్పుడైనా నీవు
ఎదిరించకుంటే
నీ నెత్రు త్రాగేసి
నిన్ను మ్రింగేస్తారు
ఉక్కు ముక్కలవంచు
నీదు సమ్మెటపెట్టు
వంచలేదా ! వీరి
వంచ నమ్మలను
లేవోయి లేవోయి కూలోడ
ఏల భయపడతావు కూలోడ.
ప్రకృతి నంతా చేత
బట్టినా నంటావు
నాజూకుగా దాన్ని
నడుపుతా నంటావు
ఎవరి కోసరమోయి కూలోడ
నీకు కానిదియేల కూలోడ.

ప్రయాగ కోదండరామశాస్త్రి



## వో రైతురాజా !

ఊరకుంటావేల నోరైతురాజా
ఎలుగెత్తి నీహక్కు లెరిగింపలేవా ?
ఎలుగెత్తి నీశక్తి నెరిగింపలేవా ?
పొట్టకన్నములేక కట్టబట్టలులేక
ఎముకలరిగేటట్లు లెన్నాళ్లుకష్టింతు
నీకుటుంబవ్యయమ్మే కష్టమైపోవ
యీశిస్తుభారమ్ము నెట్లుమోసెదవోయి. ఊ.

యింటికడ్డముపడి యేడ్చుబిడ్డలగతి
తలపోసి విలపించు కులకాంతగనియైన
నాగేటికర్రుగొని నాహక్కులిమ్మనుచు
ఎలుగెత్తి నీగోడు నెరిగింపలేవా. ఊ.

ఈదేశమీభూము లీమేడ లీసుఖాల్
అన్నియును నీపాటునకు మారురూపులే
నీవు నాగలిబట్టి నేలదున్నుటచేత
ఎగురుచూనున్నారు యీలక్ష్మిపుత్రులు. ఊ.

ఏబాడిబురదనో ఏవాడిముండ్లనో
పలుకష్టములుబడి పంట పండిస్తావు
కడుపునిండాకూడు కాన్పించదేమి
నీకష్టములకింక నియమంబులేదా. ఊ.

# మ్రింగివేస్తున్నారు

మ్రింగివేస్తున్నారు లెండోయి, "లోకాలు"
క్రుంగిపోతున్నాయి, రండోయి.

నీడు గుడ్డా లేని - కూలీల మొరల్
వినకున్న కనకున్న - వారేల వారేల
అన్నమో అనువారి - కన్నెత్తిచూడని
వారేల భువిలోన - వారేల వారేల. ||మ్రింగి||

మెల మెల్ల దరిజేరి - కలరూపుదాచేసి
కులుకుతూ తెలుపకే - గోయితీస్తున్నారు
తెల్లకళ్లనువిప్పి - చల్లచూపులుచూచి
కల్లమాటలతోటి - పిల్లలనుబట్టేరు. ||మ్రింగి||

తళుకు బెళుకులతోటి - తందనాలాడేరు
దాస్యపాశముసాచి - తల్లులనుకట్టేరు
మంచిగాకనుపించి - బంధువుగ నమ్మించి
తిన్నయింటికె చేటు - తెచ్చిపెడుతున్నారు. ||మ్రింగి||

కాలాగ్నితోడుగా - ప్రణయాళనిలంబంపి
భస్మమాతుండగా - పకపకామంటారు. ||మ్రింగి||

కాజ రాధాకృష్ణశాస్త్రి.
పురిటి సూర్యనారాయణరావు.

## రైతు జూడకపోతే !

ఆగునా జీవాలు
సాగునా లోకాలు
రాజుగా మనమెంచి
రైతు జూడకపోతె
దేశాలు తలలెత్తునా
దాస్యపున్
పాశాలు తావీడునా ! ౧.

ఆవు లంబాయంచు
ఆరచు రైతులయిండ్ల
కళ్యాణ దేవతన్
కనుల జూడనినాడు
సౌభాగ్య మేతెంచునా ? దేశపున్
సిరిసంపదలు నిల్చునా ? ౨.

పిల్ల పైరులమీద
చల్ల తెమ్మరవీవ
గాంచి యానందించు
ఘనుని గాంచకపోతె
సృష్టినైజము గాంతువా
ప్రకృతిని
"సౌందర్యమిక నిల్చునా ?" 3.

పగలు రాతిరిలేక
పాటుపడునా రైతు
కడగండ్లులన్ గాంచి
యాదరించకపోతె
రాజ్యమే యిలనిల్చునా
భూదేవి
భగ్నమైపోకుండునా ? ౪.

పొలములో రైతుండి
పొలికేక బెట్టగన్
జయభేరి మ్రోతలై
జగతి నిండకపోతె
వీర రక్తముపారునా ?
ఎల్లెడల
ధీరత్వ మడుగంటదా ? ౫.

శెట్టిపల్లి వెంకటరత్నం, గిరిరాజు రామారావు.



## లెమ్మా, లే లెమ్మా

సుత్తీకొడవలి
హత్తిన జెండా
కార్మిక కర్షక యోధుల జెండా
చేతబట్టుకొని
పంతము దీర్పగ
లెమ్మా వేగమె
లెమ్మా, లెమ్మా ॥
దేవ దేవ యను
బ్రోవుమటంచు
దేవులాడకూ
దేబెరించకూ ॥
పొట్టబట్టుకొని
చాకిరిచేసిన
దేవుడెవుండెు
కష్టకాలమున
గావడె? నిన్ను
కష్టకాలమున
కావనిదేవుడు
వున్నా వూడిన
ఒకటేనోయ్ ॥
ఎండలో వానలో
గండుచలిలో
ఎంత చేసినా
గొంతుకదిగదె?
పొద్దుగూకులు
ఆకలి తీరదె?

ముత్తేవి మాధవాచార్యులు.

## కర్షకా!

మరఫిరంగుల గుండ్లు
మార్మ్రోత లిడుచుండ
పశుబలంబులు ఘోర
ప్రళయ తాండవమాడ
లోకంపు టాకలికిగా కర్షకా!
ఏకాకివై దున్నితి!
పన్నుభారము శిరము
పగుల గొట్టుచునుండ
వెన్నుకంటెన కడుపు
కన్నీరొలుక జేయ
శోకమే లేనట్టుగా కర్షకా!
ఏకాకివై దున్నితి!
కాల మొక్కటిగ కల
కాలముండగ బోదు
కారుచీకటి కడల
హోరూర కుండుగా
కాంతిపుంజం బల్లదే కర్షకా!
శాంతిసౌఖ్యము నీకగున్.

ఆచార్య (చిత్రగుప్త.)

# నీ నాగలియె నీ కార్ముకము

౧. ముందరంజను వేసి, ముందుగా నీశక్తి
ముఖ్యంబుగాజూప లేలెమ్మ
అందమైనట్టి యీ ధరణీతలము నీదు
అరచేతిలోనుండు రారమ్మ.

౨. పన్నుభారము నెత్తి పగులగొట్టుచునుండ
మిన్నకుంటివిదేల భయమేమి,
వెయ్యారు విధములను వెలయు నీహక్కులను
వేవేగదెల్పంగ రావేమీ !

3. పడరానిపాట్లను, పడియున్న యాకాల పద్ద
తంతయుబోయె లేవయ్యా !
కన్నీరుగార్చెడి కాలమంతయుబోయె,
కర్షకాయిక మేలుకోవయ్యా !

౪. నీ నాగలియెనీకు, నిజమైన కార్ముకము
నీదున్న లేనీకు గుర్రాలు !
నీదు గుర్రాలుబూని నీ కార్ముకముబట్టి
నీకు జడియవె యెల్లలోకాలు. ॥ముందరం॥

అప్పారావు, వావాం.



# ఆవేదనాగ్ని

ఆవేద నెక్కువై ఆవేశ మెక్కువై
వేయినాల్కలతోడ వేగిరము చెప్తాము, ౧

కష్టపడు వర్గాన్ని ఇష్ట మొచ్చినరీతి
పీడించి పీడించి పీల్చిన రక్తాన్ని
పొట్టనిండా త్రావి పోవవీల్లేదంటు ౨

కూడులే కిందరము కుళ్లి చస్తుంటేను
మస్తుగా తినిమీరు వస్తువుల నన్నింటి
దాచుంచుకొన నేడు తావుండ దండోయ్ ౩

ఆగదోయ్ యికముందు సాగదోయ్ తంత్రము
కష్ట పడువారిదే కాదె హక్కంతాను
సోమరికి అందులో చోటుండరాదంటు
వేయి నాల్కలతోడ వెలిగి చెప్పుతాము ౪

యెదురు వచ్చారంటే యెఱ్ఱని అగ్నితో
ఆవేద నెక్కువై ఆవేశ మెక్కువై
మాడ్చేసి మసిచేసి మట్టిచేసేస్తాము, ౫

చదలవాడ పిచ్చయ్య.

# భూదేవి, మన భూదేవి

పేదసాదల భేదములేక
పాడిపంటల ప్రేమతో నొసగి
పిన్నపాపల బ్రోచెడు తల్లీ భూదేవి.

పాపపుణ్యముల భారంబనకను
సర్వజనులను సమతా దృష్టితో
కన్నతల్లివలె కాచెడు దేవి భూదేవి.

కష్టపడినను కడుపు నిండకా
కర్షకులెల్లరు క్షోభింపంగ
సౌఖ్యముకల్గునె సాకెడు తల్లికి భూదేవి.

చెట్టుపుట్టల చెరువు చేనుల
పంచుకొనుటకై ప్రాకులాడెడి
తుచ్ఛులనెల్ల తుదిముట్టింపదె భూదేవి.

హక్కుభుక్తములు సర్వము మావని
పాడిపంటలకు ప్రభువులు మేమని
కష్టపడుటయే కర్షక విధియని
సౌఖ్యము మరిగి సోమరులైన
ధనికదాసుల దగ్ధము చేయదే భూదేవి.

సిరిసంపదలకు పెట్టిపుట్టితని
సౌఖ్యజీవనమె (తన) జన్మహక్కని
పరులందరు తన బానిసలంచును
పేదలందరిని పీల్చివేసెడి
భోగలాలసుని భగ్నము సేయదే భూదేవి.

కష్ట జీవుల కడుపులగొట్టి
కార్మికులెల్లర కాల్చివేసియు
రాక్షసత్వమున రాజ్యములేలెడి
క్రూరమానసుల నణచి వేయదె భూదేవి.

పాపంబిటుల పెరిగి పోవగా
దేశమంతయు దుష్టులమయమవ
గర్భమునంతా బ్రద్దలు చేసుకు
మానవాధముల మ్రింగివేయకను
మాధ్యం కలిగి మెదలకుండునే భూదేవి.

## ఆకలి

ఆకలి! ఆకలి!! మండే ఆకలి!
నరములన్నిటిని నమలే ఆకలి!
నీతినియమముల జాతిభేదముల
పాటించొద్దనే బండ ఆకలి;
మానవత్వమును మరపించేసి
దోపిడికొరకై తోలే ఆకలి!
కాళరాత్రి లోకాలన్నిటినీ
గాలింపించే కటిక యాకలి
అభిమానాన్ని ఆశయాలనీ
సహనశక్తినీ చంపే ఆకలి!
ప్రపంచమంతా భ్రమరూపంబని
విలపించేయూ వెర్రి యాకలి
నిరాశతోడ వైరాగ్యాన్నీ
కలిగిస్తుందీ కాలే యాకలి

చదలవాడ పిచ్చయ్య (వాహిని)

# అన్యాయకాలము

అన్యాయకాలంబు, దాపురించిందిపుడు, అందరము
మేలుకోవాలండి
మాన్యాలు, భోగాలు, మనుజులందరికబ్బు మార్గాలు
వెతకాలి రారండి. అ.

ఏటిపాడుగునదున్ని యెరువేసి నీరెట్టి నూర్చి
పండించేది మనవంతా
గోటుసేయుచు బూతుకూతలనుకూసి
తలకొట్టికొనిపోవు టింకొకరొంతా. అ.

పొగలలో మరలలో పొగిలి పొగిలి సరకు
పుట్టించియిచ్చేది మనవంతా ?
తొగరువా తెరసాగను తొయ్యాలులతో కులికి
విరగబడుచుండు టింకొకరొంతా ? అ.

కూలిచాలక కడుపుమాడుతూ గుహలలో
కుందుతూకుళ్లడము మనవంతా ?
గాలిమేడలలోను కమ్మతావులలోను
గర్వముగ భోగమింకొకరొంతా ? అ.

గరిమెళ్ల సత్యనారాయణ, (చిత్రగుప్త)

## రైతుదండు ప్రబోధము

కర్షకులారా ! రండురండింక నిరాదరులము కామింక మీదటను.

౧ బాధలసహించి భావములడంచి
సడలిబడలి వెడగులవలె నుంటిమి
భాగ్యమువారిది బాధలుమనవని
తలంచుటలు తరతరములవారికే ! కర్ష-

౨ మననిటులడంచి మనపై దిరుగుచు
కట్టడిచేయగ వారు పితరులా !
సంపన్నులు బహుశక్తిమంతులట
ఎవ్వరిభాగ్యము ? ఎట్టులవీరిది ? కర్ష-

3 మనదేభాగ్యము మనమేకర్తలు
మదించికడింది మగటిమిజూపగ
వీరులువీరా వెర్రులుమనమా
లెండులెండింకను భీరులుగాకుడు. కర్ష-

౪ మనమందర మొక్కటియై నిలచిన
ఎవ్వరితరమా మనలనాపగను
స్వతంత్రమనునది జన్మహక్కుగా
దానిచెంద యీదినమే సుదినము. కర్ష-

౫ సత్వరంబుగా రైతురాజ్యమును
స్థాపింతము మన హిందూదేశమున
రైతురాజ్యమను రమణీమణిసే
సేవించుట బహు శ్రేయోదాయము కర్ష-

పి. టి. రెడ్డి.

## పైవారి యూడిగం మానండి ?

మిన్నుమన్నెరుగక మీదుకిందెరుగక మెలగడవేటికే చిలుకా.
ఎన్నాళ్లుబ్రతినా యేమిసామ్రాజ్యమే కొన్నాళ్లైగా రామచిలుకా.
నీతోటపండ్లయినా నీకు దొరకకపోయె నీకెంతగర్వమే చి.
నీతోటివారిలో నీచమాయెను బ్రతుకు నిన్నెవ్వరెంతురే చి.
పరులపంచకుపోయి ఫలములను ఆసింప పనియేమిగలిగెనే చి.
పరులు నీతోటలోబడి కొల్లగొట్టంగ పలుకవేమి రామ చి.
వాకట్టుగట్టి నీవైభవము హరియింప వారి నమ్మెదవేల చి.
ఈకలన్నియుఁవొలిచి యెగురమనుచున్నారు యెట్టులెగిరెదొ! రామచిలుకా.
కండ్లల్లొ దుమ్మెసి కాయలన్నియుగోసి కడుపుమాడ్చిరి నిన్ను చి.
నీతోటకాలార నిన్ను దిరుగగనీక నీకాళ్లు విరచిరె చి.
నీతల్లిస్తొత్రంచు నేలనేమురిసేవు నీనోటమట్టిగా చి.
ఇనుపకమ్ముల మధ్య యిరికించి నినుగాంచి ఇకిలించుచున్నారు.
కటకటా నీనమ్మకంబింక చాలించి కదుపవే మీవారి చి.

నె. వెం. రామానాయుడు.



# వి ప్ల వ ం !

రావా సోదర రణరంగానికి
రగులుటలేదా ? బొగులుటలేదా ? నీ సత్వం
ఉబుకుటలేదా ? ఉరుకుటలేదా ? నీ శౌర్యం !
రంగుజాతులని
కర్మజాతులని
కార్మికజాతని
జాతికి జాతికి జగడములున్నాయ్ —
గిరగిర తిరిగే సుడిగుండాల్లో
గిరిలోయలలో గెంటి చంపుదాం ! రావా.

మానము లేదా ? హీనుడవీవా ?
శౌర్యములేదా ? చవటవునీవా ?
మాలమాదిగని
మలినపు కులమని
అంటనికులమని
కులముకు కులముకు భేదములున్నాయ్ !
భగభగమండే మంటల్లో బెట్టి
బయళ్ల మధ్య భస్మం చేద్దాం ! రావా.

హృదయములేదా ! బుధుడవుకావా ?
జ్ఞానములేదా ? జీవుడకావా ?
ఆర్యులమతమని
ఆంగ్లులమతమని
మతమే లేదని
మతముకు మతముకు
మనిషికికూడా

సంకుచితాల్ బహువెలిశాయి.
భుగభుగపొంగే వేడియావిరిలో
యెడారిమధ్యను యెగిరేద్దాం. రావా.
మానవజాతని మహి నొకటేయను
మాతృదేశపు మాన్యులచరితల్
మెరిపింపుగా, జగములు వలపింపక్,
తల్లిబిడ్డలే దరిద్రులైనా
తోటిసోదరుల దూరెడిపాపము
తలపింపుగా, మనములు పులకింపుగ్
ఒకటేదైవం ఒకటేమతమని
సంకుచితాలకు స్థానమే లేదని
తెలియింపుగా ప్రేమకు తలవంపన్
భారతమాతకు జాయ్ జాయ్ జాయ్ !

"హరి" (చిత్రగుప్త)

## కార్మిక కర్షకుల మేల్కొలుపు

రావెరావె నల్లతుమ్మెదా ? ఇంత రాత్రేల జేసేవు తుమ్మెదా ?
నీ, వాడ నొరులున్నారు తుమ్మెదా ! వచ్చివారిపోద్రోలవే తు.
మోటుతుమ్మెదిలొచ్చి తుమ్మెదా ! నీదుతోటలోబడ్డాయి తు.
నీ, తోటెల్ల జెడిపోయె తుమ్మెదా ! ఇంక తొందరగ మేల్కొనె ॥
కొమ్మలాజెరచెనే తుమ్మెదా ! పూరెమ్మలా విరచెనే తు.
అందచందములేని ఆతోటయెందుకే పొందుగావారిని పొమ్మనితరుమవే రావె.
జగతిలోనీపేరు తుమ్మెదా ! దాస్యజాతిగా నెంచిరే తుమ్మెదా
జగతికంతకుమున్ను తుమ్మెదా ! నీవె చెప్పితివి జ్ఞానము తు.
నీపాటమరచితివె తుమ్మెదా ! ఇపుడు నీమాటమరచితివే తు.
పరులపాటలుపాడి, పరులకుచెయిజాచి, పరులభావముచేత, పరమును
మరచితివె. రావెరావె.
లేపవేమీవారి తుమ్మెదా ! మత్తు బాపవేమీవారి తుమ్మెదా. రావెరావె.

నె. వెం. రామానాయుడు (శంఖము)

మాకొద్దీ పారెస్టుకస్తీ -మా త్రోవల్లో పోంచుండి
మమ్ముల బట్టేటి. మా.

(1) గొర్రెల యెద్దుల - బర్రెల ఆవుల - కొండల్లో మెయ్యానీరు
హెచ్చు - ఫుల్లారి కట్టాలంటారు - మా కష్టాలు జూడరువీరు.
పసువుల గోడులు భరియించు టెట్లాగో. మా.

(2) నాగెలి ములుగట్టె - నగలు వగైరాలు - మమ్ముల తెచ్చుకోనీరు
ఆకసెందుకో యొసగనెలేరు, వడ్లు - మేమెట్లు పండించేదా
ము - రయితులు లేనిచో రాజ్యాలు నిలుచునా. మా.

(3) కంపదెచ్చినయడల కొంపలుదీసేటి - కేసులు దెచ్చిబెడ్తా
రు, వెంట - కాంపౌండునే వేసుతారు, జీ - నోటీసుజారీ జే
స్తారు - కట్టాలేనోళ్లను ఖైదులకేస్తారు. మా.

(4) కట్టెలుదేనీక కావలజేయుచు, కొండలు మావే
నంటారు - ఎండు - ఫుల్లాలు తెచ్చుకోనీరు, వంపు - టె
ట్లాని యనుకొనబోరు_వీరిపాలన మెప్పుడు కూలిపోవునోరైతా. మా.

(5) గుడిసెకు - వాసాలు కొట్టుకుంటె మమ్ము పో
నిచ్చె వారాలులేరు - బీద - సాదాల పీడించుతా
రు, మా - కింట్లెందుకని యెంచుతారు, వీరి -
దుడుకుచేష్టలువేగ దునుమాడు మో రైతా. మా.

(6) ఫుల్లారి భారాలు పబ్లీకులంచాలు పైగాను
కాంపౌండులోయి, వీటి - భారమెప్పుడు.
బాయునోయి రయితు - సౌఖ్యంపు బ్రతుకె
ప్పుడోయి, ఇకనైన ధర్మము యెరిగింపుమోరైతా మా.

# ఆర్పగవలదె ఫారెస్టుకస్తి

2(1) రైతుసంఘముల - బాదుకొల్పుచు
రైతులశక్తిని - రచ్చకుదెచ్చుచు
ఆర్పగవలదె - అడవుల బాధలు
ఫారెస్టుకస్తిని బాపగవలదె. ఆ.

(2) ఆదికాలమున - అడవులన్నిట
అడ్డములేక - అందరిగొడ్లు
పచ్చికమేసి - బలిసియుండవె. ఆర్ప.

(3) మధ్యన బొయ్యెడి - మన కాలంబున
అటవీశాఖలు - అమలుకు వచ్చెను
జీవధనంబుల - చేవలు చెడియెను. ఆర్ప.

(4) ఆవుల తిప్పల - నారయలేము
గొర్రెల యార్తులు - గూల్చును మదిని
జీవధనంబులు - జీర్ణము బొందెను. ఆర్ప.

(5) శవములబోలి - శల్యంబులలో
నడుగిడజాలక - తడబడుచున్నవి
మృతజీవులవలె - మనుమ నున్నవె. ఆర్ప.

(6) పోషణజేసే - మార్గము దెలియక
రాలిపోయెడు - వానిని జూచి
రాల్చుచుంటివి - కన్నులనీరు. ఆ.

ఉ. వెంకటక్రిష్ణయ్య కవి.

## ప్ర బో ధ ము

నిరతంబు మమ్మెంతొ నిర్బంధ పరచుచు
నాతత సౌఖ్యంబులందు నొకడు
మాయలు పచరించి మానుషత్వము మాన్పి
చేచేత పశువులజేయు నొకడు
స్వార్థార్థియై మమ్ము సర్వవిధంబుల
దాసులగా జేసి తనియు నొకడు
కూడుగుడ్డయులేక కుములు మండగ మేము
దయజూపనట్టి యధర్ము డొకడు

ప్రభువులై నారు సుమ్ము మా పాలనిపుడు
ధనికవర్గంబు; మీరింక దాస్యవృత్తి
నెట్టులరి కట్టనుంకింత్రొ యెరుగరాదు
మేలుకొనుడింక కార్మికుల్ ! మేలుకొనుడు
మేలుకొనుడింక కర్షకుల్ మేలుకొనుడు

## క ర్ష కు డు

ఉ. హాలికచక్రవర్తి ! వదనాంబుజమున్ ముకుళించెదేల ? కా
ద్దాలిక సార్వభౌమ ! కసుదమ్ములు కార్మొగులయ్యె నేల ? దు
ష్కాలము చెల్లెపో శ్రమిక కర్షక సంతతికిన్ నిజమ్ముగా
మేలుదినంబులల్ల వె సమీపముగా జనుదెంచె గాంచుమా

క కొడవలి నాగలిచే మను
గడగడపెడి కూలివాడు కర్షకజనుడున్
పుడమీ జనసంతతికిన్
కడుపారగ నన్న మొసగు ఘనదాతలుగా

6UA



మల్లిపెద్ది కృష్ణమూర్తి

సవరసంఘ అధ్యక్షులు, ఉ. వి. రైతునాయకులు



జి. రామిరెడ్డి.   యన్. బి. రంగారెడ్డి,

కర్నూలుజిల్లా రైతునాయకులు

## రై తు ర క్ష ణ

దినమెల్ల కష్టించి పనిచేసి పడసిన
కడుపునిండని పట్టి గంజితోడ
వెలుగుగాలియుజొర వీలులేనంతటి
యిరుకుగల్గిన చీక టిండ్లతోడ
మాసిపేలికలయి మదికేవపుట్టించు
మొలకుచాలనిగుడ్డ ముక్కతోడ
మడ్డియొడళ్లతో మడతలై వెన్నంటు
కడుపులతో గుంట కళ్లతోడ
అనుభవింపరాని యవమానములతోడ
చావుబ్రతుకుగాని జీవనంబు
గడుపుచున్నవారు కటకటా ! పాటక
ప్రజల నాదుకోరే ! భ్రాతలార !

మం. వెంకటశర్మ.

## మా గాం ధి :

కొల్లాయి గట్టితేనేమీ మాగాంధి "మాలడై మెట్టితే" నేమీ ?
వెన్నపూసామనసు కన్నతల్లి ప్రేమ పండంటిమోముపై బ్రహ్మ తేజస్సు
నాల్గుపరకలపిలక నాట్యమాడేపిలక నాలుగువేదాల నాణ్యమెరిగిన పిలక
బోసినోర్విప్పితే ముత్యాలతొలకరే చిఱునవ్వునవ్వితే వరహాలవర్షమే
చకచకనడిస్తేను జగతికంపించేను పలుకుపలికితేను బ్రహ్మవాక్కేను. కొల్లా.

బసవరాజు అప్పారావు.

## రైతురాజ్య రథము

ఆ రథమందు దీప్తమయమై కనుపట్టె నిజప్రభావ దు
ర్వార పవిత్రమూర్తి కనుపండువు సేయుచు ధర్మజీవనా
కారమొ శాంతిబింబమొ యకల్మష సత్యనికేతనంబొ, సం
సారఫల స్వరూపమొ ప్రజాహృదయంబొ యనన్ వెలుంగుచున్.

ఒకచేతన్ రుధిరంపు బాత్రమును వేఱొక్కట బీయూష
పాత్రికయుం గైకొని సభ్యతామిషమునన్ దేశంబునందెల్ల నిం
తకు ధర్మంబులుగాక యెన్నబడు నన్యాయంబు లీనాటితో
వికలంబై చనుగాక యంచు గరుణావేశమ్ము దీపింపగన్.

పచ్చినెత్తురు నమృతంపు బాత్ర బోసి
దివ్యదుగ్ధంబుగామార్చె దేవిమహిమ
హాలహాల గర్భమందైన నమృతరసము
సంభవించు నటంచిలజాట నేమొ !

నిలువదు స్యందనంబు ధరణీపతిపాలన దండభీతిచే
నిలువదనాథ బాష్పములు నిల్చిన పల్లపు నేల మొలసగిం,
పులమరపించు క్రించు దనపుంజతురాత్ముల కాగబో దనర్గళ
జనమొప్పనేగెడిని గన్నులకుంగనరాని చోటికిన్."

పూర్వసింహాసనంబుల ప్రోజ్వలంపు
మణిమయ కిరీటముల భోగమందిరములు
చక్రసంఘర్షణంబున జదిసిపోయె
యవియివియనంగరాక రూపలెడు నేడు

లేవు దివ్యతురంగముల్ లేవుకరులు
ప్రజలే యాతేరు మోకుల బట్టువారు
వాయుజవమున దారకాధ్వమున నేగు
నంతరాయశతంబు గలనై నదాటి
తేరుజాడల నెత్తురు పాఱిపాఱి
బంగరుంబంట బండించె బక్క నేల
జక్రనేములు దాకిన స్థలముల్లెల్ల
సస్యలక్ష్మికి గళ్యాణశాలలయ్యె.

—రామిరెడ్డి.

## జ య భే రి

జయభేరిమ్రోగింది ఓ బీదరైతా
జయగేయములపాడ సాగిరమ్మింకా. జయ.
రైతుకొంపలుదీయ రాజులంతాగూడి
ఆలోచనలుచేస్తి అణచివేశానని. జయ.
కర్షకులు గెల్చారు కదనరంగమునందు
భరతవిద్వేషులు పారిపోయారంమ. జయ.
పువులదండలువేసి పూజద్రవ్యాలతో
మంగళాగానంబు మననంబునేయంగ. జయ.
విశ్వరూపముమాది విశ్వభావనమాది
విశ్వలక్ష్మిమాది విజయంబుమాదని. జయ.

శెట్టిపల్లి వెంకటరత్నం (వాహిని)

# జమీందారీ రైతులబాధలు

ఎస్టేటురైతుకిక నేముందిరా బాబూ
కష్టాలలోపలనె నష్టాలుగలిగె. 1

ఇష్టమొ స్తేపన్ను హెచ్చించుతారండి
కష్టమైనా బెట్టి కక్కుమంటారు. 2

హెచ్చుజేసిన పన్ను యేనాడు తగ్గదిక
వచ్చుబడియోచించు వారులేరండి. 3

పంటనష్టముయెంచి పన్నాపుచేస్తారా ?
కంటనీళ్లనుపెడితే కనికరిస్తారా ? 4

ఒక్కొక్కయెస్టేటు కొక్కొక్కదారండి
బక్కరైతునకున్న బాట, గోదారి. 5

ఎండేది పండేది ఎవరుచూస్తారండి
ఉండేది తెమ్మంటు ఊదరెడతారు. 6

వానలున్నాయంటే వరిచేనుపంటండి
వానలే ఎగబెడితే పండించుటెట్లు ? 7

ఏటినీరొస్తేనే ఎవరికైనాబువ్వ
ఏటినీళ్లేనపుడు ఎందులకురవ్వ. 8

కాలువకుగట్టయినా కనుపించదొకచోట
కాలువకుగట్టుంటే నీళ్లుండబోవు. 9

పండితే ఎస్టేటు పన్నిచ్చుకోవచ్చు
ఎండితే ఇవ్వడము ఏలాగు బాబూ ? 10

పండిందనేమనము భావించుకొందాము
పండితే ఆపైన బాధలెన్నండి 11

కరణమొస్తాడండి, మునసబొస్తాడండి
తరువాత ఎస్టేటు తగవు ఉద్యోగి 12

మానూలు సముదారు మరితాణేగారండి
యీపాలు వెనుకటిది ఇవ్వమంటారు 13

మామూళ్ళతో రైతు మట్టమైపోతాడు
ఏమంటేయేముంది ఎవడువింటాడు 14

పచ్చగడ్డీమోపు పంపమనిఒకడంటే
పచ్చగుంటేమీకు నచ్చమనిఒకడు 15

ఎండుగడ్డికొరకు ఏడ్చునింకొకడండీ
దండుగెన్నకధాన్యం దండుతాడొకడు 16

అడవులకు పశువెళ్లి నందులకు తంటా
అడిగింది లేదంటే అందుకోతంటా 17

పెద్దవుద్యోగులకు పెదపెద్దమామూళ్లు
పెద్దమ్మయేవార్ని పెంచుకుందేమో 18

మామూలుకడ చిన్న మాటపట్టింపొస్తే
ఏమన్న అధికార్ని యిబ్బందిఘోరం 19

పిలవవోయ్ రయితునని పిలిపించుతారండి
నిలువుకాళ్ల మీద నిలువబెటుతారు 20

ఇంటికిబోనీరు రెంటికిని బోనీరు
కంటితో చూడరిక కరుణించుటెట్లు ? 21

పోతాను బాబంటే పొగరుబోతంటారు
చూతామనీవుంటే చూడబోరండి 22

ఆలించి రైతుమొర లాలించువాడెవడు
మేలించిరైతులను పాలించునెవడు 23

ఇవ్వకుంటేచిక్కు ఇచ్చితేయిబ్బంది
రవ్వరిట్టహెచ్చి రైతు చెడినాడు 24

గుల్లగుట్రాఅమ్మి కొంతపన్నిస్తే
ఇల్లుతనఖాబెట్టి ఇరసాలగడితే 25

పెండ్లిపేరంటాలు ప్రేతకర్మలువస్తే
ఒళ్లుకళ్లూగూడ చల్లబడిపోతే 26

అప్పులిచ్చినవాళ్ల దాపైన బాధండి
అప్పుడప్పుడు చుట్టాలందరిదిబాధ 27

అంతులేనిబాధ లావ్వరించుకుపోతే
చింతలకు పుంతలకు జీవితాలింక 28

ఎన్నాళ్లుయీబాధ యెస్టేట్లతో మనకు
ఉన్నశక్తిచూపి ఊపిచూద్దాము 29



## ధర్మ వీరుడు

దేశమంతయు నెపుడు కర్షకా! నిన్నెనమ్ముకొని యున్నది కర్షకా!
ధర్మవీరుడ వీవు కర్షకా! మనకు ధర్మంబె ధనమోయి కర్షకా!
ఉత్సాహమే లేక కర్షకా! ప్రజలు శవమట్లు పడియుంద్రు కర్షకా!
ధైర్యంబు దాల్చుమో కర్షకా! రోజులీలాగెయుండునా కర్షకా!
లేవోయి, లేవోయి, కర్షకా! లేచి నీశక్తి గన్పరుపుమా కర్షకా!

"గణపతి"

## మేలుకొలుపు పాట

మేలుకొనుమీ కూలిబిడ్డా
మేలుకొనుమీ రైతుబిడ్డా
మేలుకొనుము ప్రభాత మాయెడి
మేలుకొనుమయ్యా వత్సా! మేలు.

అల్లదే తొలికోడి కూసెను
పిల్లకోడెలు పిలుచు చుండెను
మెల్ల మెల్లగ జీవకోటికి
మెలకువయు గలిగెగా, వత్సా! మేలు.

రైతు లేనిచో రాజ్య లక్ష్మికి
శోభలేదను సూక్తి నెరిగియు
మాతృదేవికి మహిమ దెలుపగ
మసల జనుమయ్యా! వత్సా! మేలు.

కాజా రాధాకృష్ణశాస్త్రి.

# కర్షకావళి యేకమైతే ?

కర్షకావళి యేకమైతే, కూటికేమీ తరుగురా
కూలిలందరు యేకమైతే, కూటికేమీ తరుగురా
కర్షకావళిలోన బలమీ, కాలమందున నుండెరా
కూలివాండ్లలోన బలమీ, కాలమందున నుండెరా
కర్షకులమైనట్టి మనకూ, కులము లెందుకు తెలుపరా
కూలివాండ్లమైన మనకూ, కులము లెందుకు తెలుపరా
కర్షకులమైనట్టి మనమూ, కలిసి యుందుము సోదరా
కూలివాండ్లమైన మనమూ కూడియుందము సోదరా

అన్నా కర్షకు లేకము కావలెరా
అన్నా కూలీ లేకము కావలెరా

ఎండ వానల కోర్చిమనమూ కండలను కరిగించియూ
దండిగా రకరకములైన, ధాన్యముల పండిస్తిమీ
పండిన పంటంత సోమరి, పోతులకు దెచ్చిస్తిమి
తిండిలేకను చెట్టు గుట్టలు, తిరుగుతూ మనముంటిమీ అన్నా.

కష్టపడి యీ మేడలన్నీ, కట్టినది మనమే గదా
కష్టపడి యీ ఫ్యాక్టరీలు, కట్టి వారల కిస్తిమీ
కష్టజీవులమైన మనకూ, గుడిసెలే గతియాయెరా
కష్టపడి పని చేయుచున్నను, కడుపు నిండుటలేదురా అన్నా.

ధనము ధాన్యము తరుగనంతా, దేశమందున నుండెరా
తినుటకున్నప్పటికి దానికి, దూరమై పోయాముగా
ధనికులే యీ సంపదంతయు, అనుభవించుట యేలరా
తినుటకన్నములేని మనకూ, దానిలో హక్కుందిరా
సమ్మెతో స్వాతంత్ర్య రాజ్యము, స్థాపనము చేయొచ్చురా

## పతితుల పట్టుదల



పూర్వజన్మపు పాపఫలమున
బుట్టితిమి యీనాడు ప్రజగా
కాని నేడీ క్షితితలంబున
మానమేదండీ?

దేవుడందరి కొక్కడైతే
మేముగూడా ప్రజలమైతే
గజ్జికుక్కలవోలె మమ్ముల
కసరి కొట్టేరా?

మీరు మేమును బానిసలమై
యూరుపేరు నశింప నుంటిమి
దాస్య శృంఖలమెల్ల సడల
పతాక మెత్తండీ!

జాతి కక్షలులేక భారత
జాతి దైన్యము బాపగా, నొక
జాతిగా పోరాడ మనకిట
యము సిద్ధమ్మా!

డి. సత్యనారాయణశాస్త్రి.

# విదురలేవరా విద్యార్థీ

విజ్ఞానంతో
వికశిస్తున్నా
నీలోజ్యోతిని
వెలిగించేసి
నిదురలేవరా
విద్యార్థీ !__వి.
వత్సరమంతా
పలుకప్రాల్బడి
పరీక్షకొరకై
ఆర్జనజేసిన
తెలివితేటలను
కలంపోటుతో__
శిధిలంజేసి
చికాకుపరచీ
యవ్వనమూర్తుల
నవ్వుమొగములలో
విచారభావము
పెంపొందించిన
కటికి శాసనపు
కసాయితనమును
వీరత్వముతో
ఎదుర్కొనేందుకు__వి.
నవనవలాడే
యువహృదయంలో
కర్తవ్యాన్నీ
నిర్వర్తించగ

అనుభవమిచ్చే
రష్యావిద్యను
కాలేజీలలో
అమలుపర్చమని
అడిగేటందుకు
నడుముగట్టగా__వి.
పౌరహక్కులను
కాపాడేందుకు
విద్యార్థులకును
బాధ్యతవుందని
రాచకీయముగ
ఆలోచిస్తే__
పరపీడనచే
భారతదేశపు
సంపదలన్నీ
సంగ్రహింపబడి
దేశప్రజలదే
ఆశలువీడీ
విలపిస్తున్నా
పిలుపదుగోను__
మనోవికాసం
నరికట్టేందుకు
శంకలుపుట్టే
చదువునుజెప్పే
స్వతంత్రభావం
నశింపజేసి

హృదయంనిండా
స్వార్థంనింపీ
నిరుద్యోగమను
పెనురాక్షసికి
చులకనగానే
బలియిస్తున్నా
కాలేజీలను
వెలివేసేందుకు__వి.
జనసత్వాలు
సన్నగిల్లకా
యువరక్తంలో

జీవములుంటె
పరాయిరాజ్యం
పంపించేసీ__
పీడింపంబడు
ప్రజలందరికి
సుఖసంపదలతో
సౌఖ్యమునిచ్చె
స్వాతంత్ర్యాన్నీ
స్థాపనజేయగ
ధైర్యోత్సాహివై
త్యాగివవాలి॥__

చదలవాడ పిచ్చయ్య.

## స్వాతంత్ర్యసమరము

స్వాతంత్ర్యసమరంబు
సాగించుదాము
స్వాతంత్ర్య విజయంబు
సమకూరు నందాక
స్వాతంత్ర్య సమరంబు
చాలింపబోము. స్వా.

సామ్రాజ్యవాదంబు
సమసి పొయ్యేదాక
మాయ ఎస్సెంబ్లీల
మహిమంబు జిక్కి
మన గమ్యమును మీరు
మరువబోకండి;
పేద కార్మికకోటి. స్వా.

బీద కర్షక జనులు
కొదువ యెందును లేక
పొదలెడు నందాక స్వా.
సామ్యవాద ప్రభలు
జగతి అంతటనిండి
శాంతి సౌఖ్యాలవని
సాగెడు నందాక
సాగించుడీ మీరు
స్వాతంత్ర్యసమరంబు
స్వాతంత్ర్యవిజయంబు
సమకూరు నందాక. స్వా
చాలింప బోమోయి
స్వాతంత్ర్యసమరంబు.

క. నారాయణరావు (చిత్రగుప్త)

ధనికుడా !

ఉ॥ తొల్లిటినుండి సల్పితివి దుండగకృత్యము లెన్నొ ? నేటితో
చెల్లెను ; నీ ధనాఢ్యతకు జేటుదినంబులు దాపురించె ; నీ
యుల్లము చిక్కఁబట్టుకొను మోరి ! కృషీవలు లింతకాలముఁ
జెల్లియొ చెల్లకో తమకు చేసినద్రోహము సైచినారిలన్

ఉ॥ తాతలపేరు గొప్పలను, తండ్రుల వైభవసంపదాదులన్
చేతమునందు లంచుక విశేషదురాగ్రహవృత్తి బూనినన్
తాతలనాటి రీతి మదితల్లడమందగ కంపమొందుచున్
భీతిలువారు లేరు ; మరివేగమె వీడుము నీ ధనాంధతన్

క॥ సమతా, స్వతంత్రతా స
త్యములే పూర్ణస్వరాజ్య హర్మ్యంబునకున్
క్రమమైన పునాదులు సూ
శ్రమజీవులకందె స్వర్గసౌఖ్యము కలుగున్

శ్రమికుడు

మ॥ పగలెల్లన్ పనిచేసి కష్టపడితిన్ ; ప్రాణంబులర్పించితిన్ !
పగబాలైనను కూడు చేకురదుగా ; సాయంత్రమయ్యెన్ కటా !
మగనాలిన్ పసికూనలన్ జగతినే మార్గంబునన్ సాకగా
నగునంచున్ విలపించుకూలిజనుడాహా ? ఎట్టిదుష్కాలమో ?

శే॥ వెం॥ రాఘవఅయ్యంగారు.

# యువకుల దండయాత్ర

వెలిగించండీ జ్ఞానజ్యోతిని
ఉబికుబికొచ్చే వేడి రక్తముతో
ఆకలి మంటల వేడి పొంగుతో
యువకుల్లారా ! రండీ ముందుకు. 1

కర్షక కార్మిక సౌఖ్యం కోసం
రైతు సంఘములు కార్మిక సమితులు
స్థాపించండీ యువజన సమితులు
యువకుల్లారా ! రండీ ముందుకు. 2

కూడు గుడ్డలే కరువై పోయిన
దోపిడి హేయపు పనిగామారిన
కార్మిక కర్షక సౌఖ్యం కోసం
యువకుల్లారా ! రండీ ముందుకు 3

బూజుపట్టిన పాతచెరలను
ముసలి నిరాశల మూలుగులన్నీ
శరవేగంతో తెంచుకు రండీ
యువకుల్లారా ! రండీ ముందుకు. 4

జాతి శౌర్యమె తాండవింపగా
జాతి తేజమె దిక్కుల బారగ
స్వేచ్ఛాహోమపు సమిధలు గండీ
యువకుల్లారా ! రండీ ముందుకు. 5

కృత్తివాస తీర్థులు.

# జమీన్ రైతుల ఘోష

(బొబ్బిలి పాటమాదిరి)

పంటలుపోతూ భాగ్యముపోతూ బ్రదుకు భారమైతే
తంటాల్పడుతూ వ్యవసాయముతో తన్నుకు చస్తుంటె. 1

పండిందా, పండిందాయని రైతును ఎవ్వడడుగుతాడు
పండిన పంటకు చేనుమీదనే పన్నుల నిర్ణయమా ? 2

ఆకుమడికి నీళ్లేదని రైతులు హడలుచుందు రొకచోట
ఏకు మేకువలె బకాయి తెమ్మని ఏడ్పిస్తారా చోట 3

పెట్టుబళ్లయినా గిట్టుటలేదని కొట్టుకొందు రొకచోట
పెట్టుబళ్ల మీపన్నిక్కడ బెట్టుమందు రాచోట 4

దూడలగడ్డే మిగులలేదనుచు దుఃఖించుదు రొకచోట
దూడలన్నిటిని తోలుకుపోయి దుఃఖపెట్టుతా రాచోట 5

కట్టెపుల్లలను అడవుల లోపల కొట్టనీయరం డొకచోట
కొట్టుకువస్తే మోపుకణాయని కట్టిలాగుతా రాచోట 6

పేష్కస్సుకు లేదంటే రైతుకు పెచ్చుపన్నులం డొకచోట
మానూల్దారుకు మామూలండి సముద్దారుకొక మామూలండి 7

కరణంగారికి మామూలండి మునసబుగారికి మామూలండి
ఠాణేదారుకు మామూలండి షరాబుగారికి మామూలండి 8

పెద్దగుమాస్తా మామూలండి గుడ్డి గుమాస్తా మామూలండి
చిన్నదివానుకు పెద్దదివానుకు మేనేజరుకు, సెక్రటరీకి,

ఖుద్దుగుమాస్తా, సద్దుగుమాస్తా, కోడె పందెముకు, గొర్రె పందెముకు 9
కూటికి గుడ్డకు, చీటికి మాటికి

ఏదో పేరున ఎవరో ఒకరికి యిచ్చేతీరాలి
లేదంటే ఆరైతుకు సుఖమిక లేదనుకోవాలి 10

ఆరోవంతున పన్నుగట్టమని భారతమందున వ్రాస్తే
ఈరోజుల నెవ్వరువినునది యేరైతయినా వస్తే 11

ఎప్పుడైన వానజమీను రైతుల కేమున్నది రహదారి
ఇప్పుడైన మేలుకోకపోతే యింకముందు గోదారి 12

ఇష్టమువచ్చిన యప్పుడు రేట్లను హెచ్చించుట మానాలి
కష్టమువచ్చినచోట్ల రేటులను క్రమముగ తగ్గించాలి 13

ప్రమాదములచే పంటలుచెడితే రిమీషు నిప్పించాలి
జమీనురేటులు రైతువారితో సమాన మనిపించాలి 14

జమీప్రదేశపు జలాధారములు మరమ్మతు చేయించాలి
రమారమీ నిర్ణయకాలముకు సర్వే చేయించాలి 15

జమీలకెల్లా జలాశయపు సంరక్షణనిధి ఉండాలి
జమీందారులీ నిధికిరాబడి చందాలను యివ్వాలి 16

కోర్టులోన డిక్రీపొందకయే కూడదు ఆస్తికిజప్తు
షర్డుజేబులో నిప్పువంటిదీ జమీనురైతుకు శిస్తు

కమతంభూమీ గట్టూ పుట్టా
చెట్లూ, చేమలు కట్టె కంచా
పుంతలు, దారులు డొంకలు చెరువులు
మందబయళ్లు కళ్లపు భూములు
గోభూములు మరి రుద్రభూములు
కాలువలన్ని గట్లతోసహా 17

గ్రామములందున పంచాయితులకుగాను వదలవలెను
ఏమాత్రము ఖనిజాల్నిధులున్నా ఏలుబడికి పోవలెను 18
పట్టుబట్టి యివిరయితుల హక్కని ప్రకటించవలెనండి
ఎట్లుఅయిన దాస్యపుజీవనమును ఎగరగొట్టవలెనండి 19
రయితుసీటునకు జమీందారులను రావద్దని చెప్పండి
రయితుజాతిలో శక్తియున్నదీరీతి నంమ చూపండి 20
ఆంధ్రజమీందారీ రైతులకిది యదను లేచిరండి
ఆంధ్రప్రాయపు టాచారంబుల నవలకు త్రోయండి 21
ఎస్టేటుద్యోగుల చేతులలో ఎన్నాళ్లీ బాధ ?
నష్టముకష్టము లెంతకాలమిక న్యాయము లేనేలేదా ? 22
ఎన్నగలరె సంఘశక్తియింతని ఎవ్వరైన తుదకు ?
ఉన్నబాధ లందరేకమైతే ఉండగలవె మనకు ? 23

## సంఘబలం

సంఘాలలోనే శక్తులున్నాయోయి
సంఘాలుగాగూడి సాగిపోవాలోయ్
భయము వలదోయీ జయము మనదేనోయి. సం.

ఎన్నాళ్లు మనమిట్లు లేడ్చుచుండాలోయి ?
ఎన్నాళ్లు మనమింక, ఎదిరించలేమోయి ?
మది బుగుల్కొంటే, యెదరగుల్కొంటే?. సం.

దేశామంతా మనదె, దేశీయులము మనమె,
ఎవరిచేతనోపెట్టి యేడ్చుచున్నా మిపుడు,
మది బుగుల్కొనగా, ఎదరగుల్కొనగా. సం.

మన రక్తబిందువులు మసలి పోయేవేళ,
నర నరమ్మును పొంగి విరచుకొని పడువేళ,
ఎవ రదల్చెదరూ ? ఎవ రెదిర్చెదరూ ? సం.

ప్ర. కోదండరామశాస్త్రి.

80A



స్వర్గీయ శెట్టిపల్లి
తెలంగ కవి. ఆంధ్ర సాహిత్యంలో పెద్ద విప్లవాన్ని తెచ్చిన యుగపురుషుడు. పాటల ద్వారా గొప్ప చైతన్యం తెచ్చినారు



శెట్టిపల్లె వ్రాయాలి; అప్పారావే పాడాలి...
అనిపిస్తుంది తెలంగ గాయకుడు అట్లూరి
అప్పారావు గర్జించి పాడుతూవుంటే



డి. యస్. వల్లభరావు
రైతురక్షణ సంఘ కార్యదర్శి మందసా
రైతాంగానికి మరవరాని సేవచేస్తున్నారు



స్వర్గీయ కొ. సత్యనారాయణమూర్తి
ఆంధ్ర రైతాంగానికి అపారసేవచేసి
అస్తమించాడీ సంవత్సరం



బాచిన సుబ్బారావు

గుంటూరుజిల్లా రైతునాయకులు



నాగినేని వెంకయ్య

గుంటూరుజిల్లా రైతునాయకులు: డిఫెన్సుఆఫ్ ఇండియాచట్టం క్రింద వీరిపై కేసుపెట్టింది

# రైతుపుత్రా మేలుకొనవయ్యా

౧ ముందుగానిను నీవెరుంగమయా జగమంతనీపై
గ్రందుకొని యాధారపడినదయా !
అందముగ నీ చేతియన్నము పొంది మహదానంద మొందుచు
మందవై జీవంబులల్ల వెవందిగణమటునిను స్తుతించెడు. రైతు.

౨ హలముబూన్చిన సృష్టియకానుకనా ! కళ్లమున ధాన్యపు
ఫలమునూర్చిన స్థితి కలుంగుగదా !
మెలకువతో నీబలముచూపక, తెలియజాలరు
కలిమిపుత్రులు! కుడువనిలువను, కూర్చుపెట్టను రైతుబిడ్డడె
రక్షకుండని రైతు.

౩ శక్తిలేదని తలచబోకయ్యా ! సాహసమువలనను
ముక్తికలదని తెలిసికొనుమయ్యా !
వ్యక్తిపరము వితండవాదము సత్యదూరము భాగ్యభోగ్యము,
ప్రాప్తిలేదని చప్పరించకు, దీక్షయొక్కటె సర్వదార్ఢ్యము,

౪ రిక్తమాటల ప్రొద్దుపుచ్చకుమా ! పనిభారమని
తలయెత్తు భయమును లెక్కచేయకుమా !
శక్తితో నొకమారు నీ స్థితి చిత్తమున ధ్యానంబు
చేయ మహత్తరంబగు కార్య
జాలము మెత్తనైకను పట్టునప్పుడె రైతు.

# కరువుకాలం

బట్టబయలూ — యెర్రటెండా !
యెట్ట జేసిందీ ! అబ్బా యెట్టజేసిందీ
చెట్టులేదు, చేమలేదు,
గుట్టలేదు, గుసురులేదు. బ.

ఉడుకుడుమ్మా, ఉత్తకాళ్లా
కడుపునిండని కరవు తిండీ !
గుటికిడయినా నీళ్లుదొరకవు
కడుపు మంటబ్బా అబ్బా ! కడుపుమంటబ్బా. బ.

వంకలేదు, వాగులేదు,
బంకమన్నా గూడలేదు,
కంకి కెంతకు కూడ బగులదు
చంక నొస్తుంది - అబ్బా ! చంక నొస్తుంది.

మేస్తిరీలా బండబూతులు
వోవర్సుల వగల కూతలు
కడుపుకోసంగా క్షమించే
కాల మొచ్చింది - చెడ్డకాల మొచ్చింది. బ.

గొట్టిపాటి సుబ్బరాయులు.

# "మా గతి యింతేనా ?"

1 కలుగవా సుఖములు
తొలగవా కష్టముల్
తీరికేదీ మాకు
తిండియేదీ మాకు. క.

2 శ్రాద్ధస్తమానమూ
పొలములో చస్తాము
సద్దికడిగొరకదే
సంతాల మాకు. క.

3 తెల్లనీవత్తినీ
తీసియిస్తామెపుడు
కట్టుబట్టాలేదే
పైకి పంచాలేద ? క.

4 కిస్తీదుడ్డూ జతకు
చదువు కిస్తీకూడ
ఓనమాలయిననూ
బిడ్డలకులేదే. క.

5 ఎంతబందోబస్తు
ఎంత సిబ్బందీ
ఎన్నికోరుట్లున్న
ఎన్నిచట్టాలున్న
శిక్షలేమాపాలు
రక్షణేలేదే. క.

6 తులతూగుచున్నారు
నెలలేరి సౌఖ్యముల
కాలణాలేదు
కూరలో వుప్పుకైనా
కాళ్లబడినాకూడ
కాదు పొమ్మంటారు క.

7 కంటికొచ్చినా
కాలికొచ్చినా
మందు మాకూలేదూ
మూలబడిచావాలె
కర్మమని చెపుతారు
కాలమని చెపుతారు
అన్నిచెప్పూతారూ
ఆదుకొనువారేరి ? క.

8 తగ్గుచూపూలేక
తగలబడినామంటె
కలుగునూ సుఖములూ
తొలగునూ కష్టముల్.

పి. టి. రెడ్డి.

# కర్షకా

నీవు హలమును బట్టి
నేల దున్నక పోతే
రాజాధి రాజులకు
రాల దొకగింజైనా
నిలువ నీడున్నదే? లేవోయి కర్షకా!
రావోయి కర్షకా రణరంగమున దుముక.

రైతు రైతని చెప్పి
రైతు బలమూతోడ
కీర్తి గొప్పల పొంది
యెక్కడనో కూర్చొని
రైతు సంఘాలుండ
రాదు రాదంటారు. ని. రా.

పండినా పంటంత
శిస్తు కోర కమ్మేసి
పంటఖర్చుల రుణము
రక్తమును పిండంగ,
ఘనదరిద్రముతోడ
కడుపగిలి పోతుండ. ని. రా.

కత్తులూ బాణాలు
ఫిరంగి తోటాలు
లేవు లేవో యంటూ
జాలి పడబోకోయి
నీ హలము కొడవలియె

నిజమైన బాణాలు
నిన్ను మార్కొనువార్కి. ని. రా.

అఖిలభారత రైతు
సంఘమే యుండగా
తమ స్వార్థములకొరకు
తమ దౌష్ట్యముల కొరకు
నేతి బీరల్లాంటి
సంఘాలు నెలకొల్పి
నిజమైన సంఘాలు
నీరసం బొనరింప
మితవాద నాయకులు
సృష్టించుచున్నారు
మెలకువతో కనిపెట్టి
కొట్టకుంటే దెబ్బ ని. రా.

ఎన్నోమారులు నిన్ను
మోసాలు చేసారు
భేదాలు పెంచారు
నీ పెంపు గూల్పంగ
అట్టి పెద్దలకీవు
నీతిగరపకపోతె
కొట్టకుంటే దెబ్బ

ధీరతతో - వీరతతో
బాలకేసరిలాగా
శత్రువులపై దుముక
రావోయి కర్షకా
రణరంగమున దుముక ని. రా.

# యువజన ప్రబోధము

1. యువజనులారా లేలెండీ,
యువకుల్లారా రా రండీ,
యువతీ మణులందరు కూడి
స్వతంత్ర సమరము నడపండీ. యు.

2. ఉత్సాహముతో, ఉల్లాసముతో,
ఉద్రేకముతో, వేడి రక్తముతో,
వీరులు, ధీరులు, విజయోత్సాహులు,
రా రండోయీ, లే లెండోయ్. యు.

3. పోతనకాలపు పౌరుష మేదీ?
రాయల కాలపు శౌర్యంబేది?
జగముల నేలెడు, భారత జననీ
దాస్య బంధముల తెరింపజేయగ. యు.

4. పేదల, బీదల, కూలీ రైతుల
కష్ట నష్టముల కడతేర్చంగా,
దారిద్రంబును రూపుమాపగను
సౌభాగ్యంబుల పెంపొందింపగ. యు.

5. దేహదార్ఢ్యమును, మనోబలంబును,
ధైర్యశౌర్యములు కార్యదీక్షయును,
మీయందేయవి నిండియుండెగా
దేశమాతకై పోరు సల్పనిల. యు.

6. భారతదేశ ప్రతిభ నిల్పగను,
మతములనన్నిటి మంట గల్పగను,

అసమానత్వము నంతరింపగను,
అక్రమమెల్లెడ నణచి పెట్టగను. యా॥

7. మీ సేనలతో, మీ త్యాగముతో,
దేశాభ్యుదయము, దేశస్వతంత్రత
పెంపొందంగను, ప్రజ్వరిల్లగను
ధృడనిశ్చయులై సమరము నడుపుడి. యా॥

8. కష్టనష్టములు కనుపించకనె
క్రొత్త సంఘమును కోరిస్థాపింప
నవసాహసముతో నడువుడి ముందుకు
భ్రాతృభావముతో పోరుడిరణమున. యా॥

9. కార్మిక జండా, కర్షక జండా,
పేదల బీదల బ్రోచెడు జండా,
సమత్వ తత్వము ప్రబోధించుచును,
సర్వుల శ్రేయము గోరెడు జండా. యా॥

10. ఎగరేయండోయ్ రైతుల, జండా.
పాడండోయ్ రైతు పాటలను,
జపింపుడోయ్ రైతు మంత్రముల
అణచండోయ్ ధనమదాంధులను. యా॥

11. మీ ధైర్యములను పురికొల్పండి
మీ శౌర్యములను మెప్పించండీ,
సమతా దృష్టిని ప్రసాదింపగల
ఎర్రనిజండా నెగిరించండీ. యా॥

12. ఆర్థిక స్వరాజ్య మబ్బినగానీ
పేదల బాధలు తీరినగానీ

మితవాదులకదె నీతి నేర్పగను
నిరంతరము కృషిసల్పండీ. యు.

13. పేదలభాగ్యము పెంపొందింపగ
అస్పృశ్యతనదె మంటగల్పగను
అప్పులబాధల తప్పింపంగను
వీరోద్భటచే పోరుడి రణమున. యు.

14. రయితుసంఘములు, కూలిసంఘములు
దేశమెల్లెడల స్థాపింపాలె,
సమత్వ మొసగుడు సామ్యవాదమను
నవతత్వమునదె ప్రబోధింపవలె. యు.

కే. వి. రామక్రిష్ణ ఎం. ఏ., బి. యల్.

## ఎగరాలి, ఎగరాలి

ఎగరాలి, ఎగరాలి జాతీయజెండా
ఎగరాలి ఎగరాలి, మనయొర్ర జెండా !
ఎగరాలి ఎగరాలి, స్వాతంత్ర్య జెండా
ఎగరాలి ఎగరాలి, రయితుల జెండా
ఎగరాలి ఎగరాలి, కూలీల జెండా
అదురు బెదురూలేక, అడ్డేదియునులేక ఎగ.
సామ్రాజ్యవాదంబు సమసిపోవంగ
ధనికవాదంబిక దగ్ధమైపోవ ఎగ.
కూలోళ్ల గొంతులో కొనవూపిరుంటేను
పేదరయితుమేన, వేడిరక్తంబుంటె ఎగ.
కార్మికుల్, కర్షకుల్ కరము కరమూ గలిపి
జైమనకు జైయంచు జేజేలు కొట్టంగ ఎగ.

తుమ్మల వెంకట్రామయ్య (ప్రథ)

# అకలిమంట

1 మంచిదినాలు రానున్నాయి
మనకందరకును లేవండోయి
ఆకలిమంటచే మలమలమాడే
అనాథులందరు లేవండోయ్.
హింసారతిని సహించలేక
యీసడించినది ధర్మంబెల్ల
సాంప్రదాయములె కొంపదీసె ఆ
సంకెళ్లను వేనెగురగొట్టగా
దాసత్వమును తరిమివేయగా
దాసులందరును లేవండోయ్.
ఇంతకాలము అనామకులుగా
ఏమూలనో మన్నణచియుండిరి
అంతర్జాతీయపక్షమే
అశేష మానవకులమై పోవుగ
ప్రధానమగు నీ అంత్యమపోరున
పాల్గొనవందరు లేవండోయ్.

2 నేలకు రైలుకు, నదులకు గనులకు
నేతలైనవారందర గనుడీ
వారి భోగము వారలదర్జా
వారియోగము, వారలదర్పం
ఏరెక్కాల కష్టంబోగాదా ?
ఈగతి మనకష్టార్జితమంతా
ఎవరోకొందరి భోగతృప్తికై
ఇనుపపెట్టియల మూలుగుచున్నది;
ఇప్పుడు దానిని తిరిగి యిమ్మని
అందరమొకటై తొందరచేయుట
న్యాయముగా మనకొచ్చెదెంతో
అదిరాబట్టుటకే సుమ్మండి.

3 కార్మిక, కర్షక సంయోగంచే
కష్టజీవులందరి కలయికయే
పాటుబడే మన అందరిపక్షము.
మనదేదేశము, మనమేప్రజలము
పనికిదొంగలా వారలకిచ్చుట
పనిలేదండీ ప్రవేశింపగా.

# మాకొద్దీ జమీందార్ల పొందు

మాకొద్దీ జమీందార్ల పొందు - మా - ప్రాణాలపైపొంచి
మానాలు హరియించే   మా.

పంటబోయినగాని - పన్నులవిడువక - "రెంటుసూట్లు" ను వేసుతారు -
ఆవెంట జప్తుజేసుతారు - యేజెంటును ఉసికొల్పుతారు -
యిక కాదంటె మమ్ములను - కాల్చిపారేస్తారు   మా.

ఏడాదికేడాది - కెక్కువపన్నేసి - యీభూమి మాదేనంటారు -
మమ్ము కూలికి దున్నమంటారు -
మమ్ము వేధించి దోచుకుంటారు -
వారి - దౌర్జన్యములెప్డు .. తొలగిపోవునో దేవ   మా.

చెరువులు తెగెనంచు చెప్పుకుంటేమాదు - మొగలె పెడచెవి
బెట్టుతారు - కరువు కాటకాలను చూడరారు -
శిస్తు - తరుగుబెట్టి గుంజుతారు -
వీరి - కరకుపాలనవేగ -. కడదొలచుమో దేవ   మా.

ఎకరాకు "డెబ్బది" - యెన్నాళ్లుబ్రతికేము - సకలము గుం
జేసినారు - మమ్ము - వికలాంగులను జేసినారు -
కొంపలకట గుల్లలుజేసినారు -
యికమాకు దిక్కెవరు-టూబాధపడలేము   మా.

పన్నులభారము - పడలేము మాతండ్రి - కన్నుల నీరొలుకుతాయి
మా - కష్టాలు వేనవేలోయి -
చెపితే - వినిసహించగలేరోయి -
సర్కార్ గ్రామాలకైన - సాగిపోతము గాని   మా.

పన్నులువిధించుటలో - పద్ధతేమి లేక - కన్నుగానకదంచుతారు
పండిన - పన్ని శిస్తుకు ఊడుస్తారు -
కూలి - కన్నారైతుకు మిగులనీరు -
యి - ట్లైన్నినాళ్లు రైతుయేడ్చి బ్రతుకుండేను మా.

కలకాల మెండనక - కష్టించి పండింప - కడనాడు మా కడుపుగొట్టి
మాదు - కొంప భగ్గునమండబెట్టి -
మాదుకండ్లల్లో దుమ్మెత్తికొట్టి -
వారు - కళ్లములో గింజైన - మళ్లకుండజేస్తారు మా.

పన్నులభారాలు - పట్టీకులంచాలు - పైగా కోర్టుఖర్చులోయి
వీటి - భారమెప్పుడు తొలగునోయి -
రైతుకు హాయిగ - బ్రతుకెప్పుడోయి -
యీ దుష్టపద్ధతి నెప్పుడు - తొలగింతువో దేవ ! మా.

రైతువేలుకొక్క - రాగిదమ్మిడైనా - ఖర్చుచేయగబూనుకోరు
దుఃఖకరము చేస్తే వీరితీరు -
షోలో - ఆటలకు ధారబోస్తారు -
ప్రజలడబ్బుని వీరు పరిగణించగబోరు మా.

డిక్రిఅమలుకుబెట్టి - డిప్పచేతులొబట్టి - ఓట్లభిక్షకువచ్చుతారు
వారు - వలదంటె మాటవినుకోరు
మా కష్టాలుజూస్తే నవ్వూరు
యికకాదంటె మమ్ములను కాల్చిపారేస్తారు మా.

పశులదొడ్డికిగొట్టి - పాడిబర్రెనుగట్టి - ఓటివ్వమని చంపుతారు
వేరు - మాట నోటికిరానీరు
దుష్ట - కోటికి ఉసికొల్పుతారు -

మాదు - నోటికి సంశ్లేస్తారు -
కడకు - ఓటుదీసుకపోయి - చేటుమూడుస్తారు మా.

రైతుప్రక్కనబోయి ఆ రాజశాసనసభలో
రైతుకే చెడుపెత్తుతారు -
శిస్తు - ముజరాపట్టమును రానీరు -
అది - భూస్వామి యిష్టమంటారు -
అందు - కందర్ని లోగట్టుతారు -
మమ్ము - తొలగియందరువారి - వలలోనబడతారు మా.

శాసనసభకంట - చెపితే సిగ్గులచేటు - మా ప్రక్కబోతార
టోయి - పోయి మా కొంప గూల్చుతారోయి -
కడకు - మా కెవరుదిక్కు రారోయి -
యిట్టి మాటలన్నారంటె మాడ్చివేస్తారోయి మా.

లంచాలైనబెట్టి - రాజకీయవేత్తల - వంచితమప్రక్క దిప్పు
త్తారు - తమ - వంచనమును తెలియనీరు -
బలే - మంచివారని వ్రాయిస్తారు
ప్రపంచానికి వీరు - బాగుబాగనిపిస్తారు మా.

నె॥ వెం॥ రామానాయుడు.

# ఓ టు పా టు

రైతుకే ఓటివ్వవలెనన్నా ! నీ కష్టసుఖములు
రైతుప్రతినిధి చెప్పగలడన్నా !
రైతునని ఓట్లడిగితీసుక రైతుకొంపల గూల్చుపట్లను నీతి
గాదను జ్ఞానమునని గోతిలోపల ద్రోయుచుండెడు రైతు.

దారిడొంకలు లేనియూళ్ల న్నా ! మన పల్లెకొంపలు
దిమ్మెడీకి పనికిరావన్నా !
దారిడొంకలు లేకధాన్యపు ధరలుతగ్గియు పంటపాడై
తేరికొనుటకు శక్తినా దారిరైతుకు తెన్నుజూపే రైతు.

శిస్తుభారము హెచ్చెగదరన్నా ! పంటెల్లపూడ్చిన
శిస్తుమట్టుకే లోటుగదరన్నా !
శిస్తుభారము హెచ్చెరయితుల చిక్కులెల్ల మిన్నుముట్టె
కస్తిహెచ్చెను ద్రవ్యమునకీ కష్టమును దీర్చెటియోధుడు రైతు.

విందుతిండికి లొంగవలదన్నా ఒకపూటతిండే
ముందుఆకలి తీరుటెట్లన్నా !
విందుతిండితో మోసపోయి మందమతులకు వోట్లనిచ్చి, అందు
లోపము దెలిసి వెనుక కుందలాభము లేదునిజముగు రైతు.

మంచిచెడ్డలు నరయవలెనన్నా ! లోకమ్మునడవడి
కొంచమైనను తెలియవలెనన్నా
మంచిచెడ్డల జోలిమాని వంచెనచె నీ కడుపునింపిన
పొంచినన్ను అధోగతికిద్రోయించుకాలము వచ్చుచున్నది రైతు

ఓటువిలువ తెలుసుకొనరన్నా ఒకపూటతిండికే
ఓటుయిచ్చుట సిగ్గుచేటన్నా !

ఓటుతో నే ముందుస్వేచ్ఛా కోటపట్టగ వలసియున్నది
నేటికైనను నిదురమేల్కొని దాటిస్వార్థము పౌరుషముతో రైతు.

ముందునాలుక జారవలదన్నా ! అభ్యర్థులెవరో
ముందుగా యోచించి చెప్పన్నా
ముందునాలుక జారియోగ్యుల క్రిందజేసియు పరులకొసగిన
అందుకలిగెడి చెరుపుకై మనమందరము కుంగుదము గావున రైతు.

ముందుకాలము రైతుదేవన్నా ! నిదురించకను నీ
వందుపాల్గొన సిద్ధపడుమన్నా !
ముందుకాలములోన నీవానందపడగల రేఖలున్నవి
కందువదెతెల తెల్లవారక ముందుస్థానము నాక్రమింపను రైతు.

పాలనము నీ చేతిలోదన్నా నీ వెన్నుకొన్న
ప్రతినిధియె పెత్తనదారన్నా !
పాలనంబున కెవడుయోగ్యుడో ! ప్రథమమున యోచించకుండిన
పాలనముచెడి పోగ యిప్పటి పాలనమె మేలంద్రు గావున. రైతు.

కులముతో మనకేమి జోలన్నా ! కష్టించి దున్నే
కులము ఒక్కటె తెలుసుకోరన్నా !
కులము కక్షల బెట్టిమనలోపలను భేదము రగులజేసి
బలము సంపాదింప నెంచెడి తులవతనము వీడిమన రైతు.



## అడ్డేది : ఎదురేది !!

రైతులశక్తి కార్మికశక్తి
దేశముక్తికి దివ్యతారకము
ఆకలిమంటకు అగ్గినిప్పురా — రైతు.

కూలీరైతుల ఘోషతగిలెనా
కూలీపోవును రాజ్యాలన్నీ
పటాపంచలౌ వైభవమంత్రా — రైతు.

రయితుక్రోధమూ కార్మికక్రోధము
ప్రళయతాండవము పూంజిదారులకు
జామీందారులకు సింహస్వప్నము — రైతు.

కూలీరయితులు చేతులుముడిచిర
లోకాలన్నీ ఘోషిలిపోవును
దిక్కుదిక్కునా ఆకలిమంటా
కోటీశ్వరులకు చక్రవర్తులకు — రైతు.

రయితులప్రేమ కార్మికప్రేమ
విశ్వమంతటా అమృతవర్షమె
విరాజిల్లును దయాధర్మములు
విజయదుందుభులు మారుమ్రోతలిడు — రైతు.

శెట్టిపల్లి వెంకటరత్నం.

# గుండెమంట

స్వార్ధపరులైన లోభుల యంకమందు
కులుకుచున్నది కలుమల కలికినేడు
స్వార్ధపరులైన లోభుల యంకమందు
ఎపుడినుంప గజ్జెలతల్లి యెక్కగలదు. 1

కోటులాదిగ నార్జించి కూడబెట్టి
పేదకడపుల గొట్టెడి వృత్తిగాక
యేబిదురు గాంచినతడు రక్షించినాడో ?
స్వార్జితమ్మింత నిరుపేద వానికొసగి. 2

స్వర్గనరకాలు పాపపుణ్యము లటంచు
దేవతలు రాక్షసులటంచు దీర్చికూర్చి
ప్రజలభావమ్ములను జేతబట్టినార
లరయ ధనదాసులైన మతాధిపతులు. 3

న్యాయమన్నది పెద్దలయందు లేదు,
న్యాయమున్నది ధనికులయందు లేదు
న్యాయమున్నది పిన్నలయందుగలదు
న్యాయమన్నది పేదలయందుగలదు 4

మనుజుని సృజించె దేవుడన్మాట - మాట
మాత్రమెద సందియమె ! కాని మానవుడు
దేవుని సృజించెననుట సందియము లేదు
దేవుడెవ్వడు మానవజీవికన్న 5

మండిపోయెడి కడుపుతో మాడుకంటె
పొంగునెత్తురతో జనిపోవవచ్చు;
ఏండ్లదూరును పేదజీవించుకంటె
ఎప్పుడో, ముందె, కథముగించవచ్చు !

ప్రయాగ కోదండరామశాస్త్రి.

# వి జ య గా న ము

రైతు కార్మిక రాజ్యస్థాపన
చేయగావలె లెండు లెండో.

తాటియెత్తున పొంగివచ్చెడి
రైతుకార్మిక వాహినీలో
ధననిరంకుశ బలము లన్నియు
దగిలికొట్టుక పోవగానే. రైతు.

వృద్ధనాయక దీవనలతో
యువతులెల్లగు ముందునడువగ
సోషలిస్టు యువకయోధులు
సంగరంబుల ముందునిల్వగ. రైతు.

తుంగభద్రా కృష్ణవేణీ
గౌతమీ కావేంకన్యలు
రైతుకార్మిక విజయగానా
లాపనము చే పొంగుచుండగ. రైతు.

ఆరరాదీ అగ్నిజ్వాలలు
అణగరాదీ విజయఘోషలు
రైతుకార్మిక రాజ్యస్థాపన
జేసిభాసిలు నంతదాకా. రైతు.

రైతుయోధుల విజయఢంకా
రైతువీధుల మారుమ్రోగెను
రైతుకీర్తి వెలుంగుదిక్కుల
తేజరిల్లెను సూర్యుపగిదిని రైతు.

శెట్టిపల్లి వెంకటరత్నం (వాహిని)

## బొబ్బిలి రైతుల ఘోష

బొబ్బిలి జమీందారీ రయితుల బొబ్బలు వినరయ్యా
విన్నవించెదము కష్టసుఖంబులు వివరంబుగ మేము
అన్నివిధంబుల మాపనిజూడ నడుమంటిపోయె
తిన్నగ దినుటకు అన్నమయినను కన్నతండ్రి లేదు
యెవ్వాళ్లింకను యీకష్టముతో యెట్టులుండగలము ?
కన్నబిడ్డలౌ రయితులమొరలు వినవలె నిటుపైని
చాలహెచ్చుగా పన్నులుండెను శోకయ్యెను ధరలు
గరిసెడుధాన్యము అమ్మ్రదమన్నను సరికుజేయ రెనరు. రా.

చోళ్లుపండినను అళ్లుపండినను
పెసలుపండినను బెల్లం పండిన
గంటెలుకూడ గరిసెలు పండిన
సెనగకాయలవి చెడపండించిన

తక్కువధరలు హెచ్చుపన్నులు దారిలేదుమాకు
జమీందారులు పన్నులిమ్మని చాలబాధపెట్టి
ఊరూరునకొక సముద్దారును నొప్పగబంపించి
వేగమె శిస్తులు గట్టుమంచును వేపుకుతింటారు
కంచం, ముంతలు జప్తనిమాపై కన్నుఎర్రజేసి
"తలుపుతియ్యరా పశువులిప్పరా తంతామని మమ్ము"
బంట్రోతులను బంపుముందురు భరియించంగలమా ?
రంగూన్. బర్మా పారిపోయెదము రాజాగారి భూముల్
వ్యవసాయంబులు చేయజాలము పడిపెట్టునాము
అని మేమెంతన ఆలింపరు మొరలు రా.

నీకు తెలియని యంశములేవి ?
నీకు తెలియని సంగతులేవి ?

కాలువజాడ యేటిలో నేటా గలసిపోవుచుండు
బట్టీ మరమ్మతులు చేయించక పాడౌతున్నాది
వెట్టలెంతని మేము చేయడము విసుగుపుట్టె మాకు
యీకష్టంబులు జమీందారులు యించుకైన గనక
మంత్రిపదవిలోనుండి మమ్ములను మరచియున్నవారు
సాలాఖరులోగా పైకము చల్లగదెమ్మంటె
వీలాగిచ్చుట యిప్పుడను దెల్పను యిట్టికష్టదశను
కట్టుకొనుటకు గుడ్డలేకను కడుపుకు తిండిలేక
మలమల మలమల మాడుచుంటిమి మా దేవవినుము. రా.

త్రోవలేకమరి తెన్నులేకయే
దారిలేక దరిగానరాకయే
ప్రాపులేకమరి దాపులేకిటుల

యీజమీల భూములదున్నుట కెంతనోచినామో
యిన్నికష్టములు మాకేబట్టెను యెంతనితాళుదుము ?
మావలెరైతులు ఎందరోగలరు మానవలోకమున
అందరివలెనే మేముపుట్టితిమి అయినగాని మమ్ము
గవర్నమెంటు రైతులపాటు కనులజూడబోరు
గవర్నమెంటు రైతులుచెల్లించిన కాస్తపన్నులకును
యెన్నో సౌకర్యములు గానగూర్తురు నెంచగ వారలకు
మృగములవలెనే మమ్ముజూతురు తగునెక్కడిదింక
యింకమాకు వేరే ప్రతిఫలము యిలలోపల లేదు
గవర్నమెంటురియితుల సౌఖ్యంబులు గాంచినవారలకు. రా.

పాఠశాలలును పారుకాలవలు
రాచబాటలును రమణీయంబగు

పశువులు బీడులు వారికిగలవు పరిమితిలేకుండ
బండ్లయినను మరికదలాడుటకు బాటలైన లేవు
రైతుల కెంచగ సౌఖ్యంబనియెడు రక్షణలేకుండ
చెన్నపట్నమునజేరి ఖర్చులను జేయుచున్నవారు
గాని దీనులౌ రైతులమొరలను కలనైనను వినరు. రా..

పోలో ఆటలో పూతోటలలో
నీలగిరులలో గాలి షికార్లలో
మేలు వేటలలో మించు సంగతులు

చాలహాయిగ సౌఖ్యమొందెదరు సందడితో వారు
వారికిమాకు దేవుడ వీవు వాసుదేవమూర్తి
యీ రీతిగ మాగతియున్నదియని నేడ్చుచుండగాను
ప్రొఫెసర్ రంగా గారిచ్చటకు పొందుగానువచ్చి
నిద్దురబోయే రైతులందరి నేర్పుతోడలేపి
జమీందారి సేవలతో మీకు జరుగుదు లేదనుచు
భాసురంబుగ రైతు సంఘమును వారగాను నిల్పి
జమీన్ రైతుల కష్టంబులనన్ని చర్చించిరి వారు
రైతురక్షణ ముఖ్యంబనుచూ రైతులకును దోచె. రామా-రామా.

పురిజాల వెంకటప్పారావు.

## జన్మభూమిని

జనులెల్లరికి నేను జన్మభూమినిరా
ఛేదించవయ్యా అసమాన భేదముల జను.
ఆనందమున నన్ను అలరించువారు
మీరలే మీరలే మేలుకొనుడింక జను

ఆసపోతులకంత అధికారమేలా ?
మోసకృత్యములందు మోహంబులేలా ? జను.
పెద్దలకు లాభాల బొంకుల్ల నిండా ?
పేదలకు దుఃఖాల హృదయాల నిండా ? జను.

నాదినాదనెడి అన్యాయంబు వీడు
మనము మనదనెడి సద్జ్ఞానంబుపాడు జను.
సైన్యాలు నార్నెపుడు రక్షించవలెనా ?
కర్షకుల కార్మికుల శిక్షించవలెనా ? జను.
భాగ్యవంతుల వైభవములంటె నాకు
బాధించు వ్రణములని బాగ తెలియండి జను.

కర్షకులు కార్మికులు కలవండి వేగ
వార్షికోత్సవముల జరపండి వేగ జను.
మీయిళ్లు మీ సుఖము మీ ధనముతోనె
మేదినీతలమెల్ల మెరయుచుండాలి. జను.

గరిమెళ్ల సత్యనారాయణ (వాహిని)

# అవనిదేవి అనంగము

జనగణము జయమునకు జయభేరికొట్టు
అవనిదేవిని నన్ను ఆనందపెట్టు జన.

పెరనిరంకుశతలను మెడబట్టినెట్టు
ధనికయుగమునకు పెరదారి చూపెట్టు జన.

కర్షకునితలపై కిరీటమును పెట్టు
కార్మికుల కందరికి పట్టంబుగట్టు జన.

భాగ్యాలు సరిగాను పంచుకోండయ్యా
భోగాలు తగినట్లు పొందండిమీరు జన.

సకలజాతులు ప్రజలు సకలదేశములు
సోదరత్వముతోడ శోభించరయ్యా జన.

అధికారమొకరిపై వొకరికొద్దయ్యా
స్నేహపథమొక్కటే క్షేమకరమయ్యా. జన.

గరిమెళ్ళ సత్యనారాయణ (వాహిని)

## తెద్దామోయి ! తెద్దాము ! !

(1) తినటానికి నిండూతిండీ
వుండటానికి మంచీయిల్లు
చదవటానికి శక్తీయుక్తీ
ఆడటానికి అవకాశాలు
తెద్దామోయి - తెద్దాము ॥

(2) చేతికితగిన పనిపాటలును
మనసుకువచ్చిన మంచీమాట
దొరకినదంతా ప్రజలాకొరకె
చేసినదంతా సంఘానీకె ॥ తె ॥

(3) కాయాకష్టం మనసుయత్నం
మనిషికిబాధా కలగాకుండా
అన్నిటి అందరి సౌఖ్యంకొరకె
కార్మిక కర్షక జీవితమార్గం ॥ తె ॥

(4) సాగులొా పాడిలొా సంఘపువృద్ధి
శ్రమలో, శ్రద్ధలొా ప్రజలరక్షణ
శిల్పము, పాటలొా శ్రమికుల సౌఖ్యం
రోజూపెరిగే ఆనందంబు
వుండాలోయ్ - వుండాలి ॥

(5) గ్రీకుల శిల్పం - పిరమిడి పెంపు
రోములరోడ్లు - చైనాగోడ
మొగలుమహల్లు - అమెరికసౌధాల్
పారిస్సొంపు - లండనుగర్వం
సూయజుకాల్వ - పెనామాసంధి ॥

(6) జపనులనావ - అమెరికకోళ్లు
తెల్లవారలు - సామ్రాజ్యాలు
శ్రమికజీవుల - షోషముద్వారా
శిల్పుల శాస్త్రుల - వంచనచేత
ప్రజాస్వామికపు - పేరుతోడ
పెంచిరిగాని - ప్రజలకు తృప్తా? ॥

(7) అన్నిటిమించిన - ఆనందంబు
ఎవ్వరుయివ్వని - ఐశ్వర్యంబు
చరిత్రకుజెందని - శ్రామికసృష్టి
రష్యాకందిన - సృష్టిపధాన
అందరుజేరి - అనుభవింతము ॥

## మా గోడు

మాయీ పైపోటుకే
మాఖడ్గధారకే
రణరంగమున శత్రు
రాజహస్తములూడు॥
యుద్ధరంగములందు
యోధానయోధులమె
ఫలముపొందుటయన్న
పనికిమాలినవాళ్లం॥

మేమె దున్నాలిగాని
మేమె కోయ్యాలిగాని
అమాధములమగుచు
అణిగియుంటిమి బాబు॥
శ్రమకోర్చి చేయుటకు
శక్తిచాలును గాని
కట్టుకొనుటకొక్క
గుడ్డయిన లేదుబాబు.

కంభంపాటి సత్యనారాయణ.

## " దున్నరా యీ భరతభూమిని "

దున్నరా యీ భరతభూమిని, తొలకరించిన పుణ్యభూమిని
కలువెరుఁగని స్వర్గరాజ్యపు, దొరవు నీవయ్యెదవురా ! దున్నరా.
గాలి వెలుగులు జూడరా, మే ఘాలవర్షము వేడరా
సూర్యచంద్రుల గమనలీలా, శోభలను తిలకింపరా. దున్నరా.

పాడుసేలే లేదురా, నీ భావమే బీడాయెరా
పరిమళించే తోటబెంచీ, పరమశివు నాడింపరా. దున్నరా.

ఏటిలంకల మేత మేసీ, పూలగిల్లిన జోడుగిత్తల
పైడినాగటి కర్రులో జీ, వాల జీవితముండె నౌరా. దున్నరా.

ఆలుమగలూ జోడుగూడి, ఆడుకొంటూ పాడుకొంటూ
జీవకాంతుల వెలుగు సస్య, శ్రీలలో విహరించెదరురా. దున్నరా.

శుభదమగు 'రాట్నంపు' శృతిలో, సుందరీమణి పాడుచుంటే
పొంగుతూ ఆడేటిబిడ్డలై, భూములన్నీ యేలెదరురా. దున్నరా.

కాలమే తలక్రిందుకానీ, కాలయము డే ఏలుకోని
నీవు నీగోవులును శాశ్వత, జీవులై వర్ధిల్లెదరురా. దున్నరా.

కత్తికలములు బోయెరా-నీ, కష్టమే గెలిచేనురా
ప్రకృతిపురుషుల ప్రతినిధులు మీ, ప్రభుతయే నిత్యమ్మురా. దున్నరా.

తురగా వెంకటరామయ్య.

## కావుల కష్టాలు

సీ. బింకలతోడ బాల్పించుదుగాని నీ
కంచంబులోనికి గంజినీళ్లె
కొండంత నునుపత్తి పండింతుగాని నీ
కాయంబు మూయంగ గప్పుడంటె
పలుపుట్ల వడ్లగాదెల నింతుగాని నీ
క్షుద్బాధ నడగింప జొన్లజానె
కమ్మని శాకముల్గాయింతుగాని నీ
కూరకై కటికి సంబారుపొడుమె

తే. ఏమని వచింతు నీ బాము లెల్ల దడవి
కడుపుచుమ్మలు వాకు నీ కథలు విన్న
నిన్ను మరచిరెదొర లయో! నేటికెట్టి
చెట్టునిను ముట్టడించెరా సేద్యగాడ.

*   *   *   *

సీ. పెద్దపడ్డీలొడ్డిపీల్చె నీ రక్తంబు
చట్టు త్రాగుండియ సాహుకారు
లంచంబు నాసించి కించిత్తు నీతిలే
కధికారి నీకూటి కడ్డుతగిలె
బన్నంబె తెంగి నీపంట ఇల్పుక్రయం
బిచ్చిబండ్లకు నెత్తె బమ్మకటికి

దారుణంబగుపన్ను దయమాలి విధియించి
కటకటా ! నృపతి నీ కడుపుమాడ్చె

తే. ఇన్నిరీతుల నీసొమ్ము దిన్నవారె
చూచు చున్నారు నిను గడ్డిపోచవోలె
లేదొకో ధర్మముర్విపై లేశమేని
సరసగుణరత్నహార కర్షక కుమార.

*　*　*　*

సీ. సుక్షేత్రములు దయాశూన్యులై పీడించు
ఋణదాతలకు సమర్పింపవలసె
ఇల్లాలి మెడలోని నల్లపూసయు వెచ్చ
పెట్టి పన్నులపాట్టి బెట్టవలసె
కడుపుకక్కుఱ్తికై గతిలేక పశుకోటి
మెల్ల మెల్లన విక్రయింపవలసె
దినవెచ్చమునకునై తెచ్చుబాకీలకై
కొంపతాకట్టులో ముంపవలసె

తే. ధరలుపడియె, సేద్యంబు తక్కువాయె
శిస్తుమెండాయె నింకేమి సేయుదోయి
నిర్జనారణ్యమే నీకు నెలవటోయి
కర్షకా ! యిది యేనాటి కలుషమోయి.

# రైతుల రాజ్యము రైతుల భాగ్యము

రైతుల రాజ్యము రావలెనంటె
చింకి గుడ్డలో శుష్కదేహములో
పూరిగుడిసెలో క్షాత్రము గలదని
వెడలుడి, వెడలుడి, స్వతంత్రమునకై.

రైతుల రాజ్యము, రైతుల భాగ్యము
రైతుల క్షేమమె, పరమావధిగా
కార్యరూపమున సాధించిననే
భాగ్యము లబ్బును కర్షక కోటికి.

ధైర్యము బాసిన జన్మమెందులకు
స్వతంత్రముండని జీవమెందులకు
పోరుడి, పోరుడి స్వతంత్ర రణమున
శ్రామికవర్గ స్వతంత్రమునకై.

దేశసంపదయు, దేశభాగ్యమును
మన కష్టముపై నెలకొని యున్నవి
రైతు నశించిన రాజ్యమె సున్నని
చాటింపుడు మన వాడ వాడలను.

కే. వీ. రామకృష్ణ యం. ఏ. బి. యల్.

# అబ్ధివంటి గభీరత

౧. సమర సమయములందు పితరుల
క్షాత్ర తేజము నిలువబెట్టుము
శాంతిదినముల సేద్యమున
దేశమ్ము కాపాడు.

౨. బ్రహ్మనాయడు తిమ్మనాయడు
పాపరాయడు వేమరెడ్డియు
పేరురమ్మున నీకు చిలికెరి
వీర గంధమ్ము.

3. రక్తతిలకము నొసటదిద్దిరి
భక్తిమెయి నీ తల్లి ఋణమును
రక్తితోడుత తీర్పరా.

౪. కొండవీడును వీరబొబ్బిలి
గండికోటయు వీరపల్నాడ్
పోతుగడ్డయు జీవగర్రలు
పామ్ము నీకెపుడు.

౫. చేతబట్టి హలాయుధము ప్రా
చీన తేజము బావుటాగా
గాదె బోయుము శత్రుయశమును
కార్య శూరుడవై.

విజయ పార్థసారధి (పల్లెపట్టు)

# పే దో డా

ఏనాటికానాడు
పొట్టచేపట్టుకొని
పట్టెడన్నామంచు
పగులనాశించేవు
ఎట్టిగతి పట్టెరా - పేదోడా !!!
ఎట్టిస్థితినుంటిరా - పేదోడా !!! ౧

ఆలుబిడ్డాలంత
కూడుగుడ్డాలేక
కూలిపోతుంటేను
దారితెన్నూలేక
దేవులాడేవు. ఎట్టి. ౨

కష్టపడ్డాగానీ
కడుపు నిండదాయె
కలకాల మీరీతి
గడమనా - నీకు ? ఎట్టి ౩

ఏ చెట్టునీడనో
ఏదారిప్రక్కనో
ఎండనక వానక
మొండిగా నుండేవు. ఎట్టి. ౪

కర్మమంటావా !
ధర్మమంటావా !
కడుపుమాడేటి
కర్మమేమోయి ! ఎట్టి. ౫

పండినా పంటంత
భయమేమి లేకుండ
దండిగా నీదొరలు
దోచుకొన చూచేరు. ఎట్టి. ౬

ఏక్కడ ఏనాడు
ఏలోటురాకుండ
చక్కగా నీదొరల
సౌఖ్యపెట్టే నీవు
ఎట్టిగతి పట్టెరా - పేదోడా !!! ఎట్టి. ౭

కొండేపూడి వెంకటచలపతిరావు.

## రోషావజ్రం మూగుండె

ఘనులమంచు మీరుచేసేకఠినం
కసికర శీలం మానుంచి
గగనమవతలకు పోద్రోలిందోయ్
కత్తిశూలం మాగుండెన్
తెలుకుములుకు గా నాటిందోయ్.
ఓర్పు శీలం మానుంచి
పడకుచు పడకుచు పోయిందోయ్
రోషావజ్రం మాగుండెన్
రోజుకు రోజుకు కలిగిందోయ్.

"హరి"

## ఆ క లి మ ం ట

ఆకలిమంటకు పాడలేకన్నా
దరిద్రజీవం గడిపేకన్నా
నీచదాస్యమును చేసేకన్నా
వెలిగించండీ స్వేచ్ఛాజ్యోతిని
స్థాపించండి కర్షకరాజ్యము ఆ.
నిర్వీర్యముతో నిస్తేజముతో
నిస్సత్తువతో నిస్పృహుండనై
కూటిగుడ్డకై కూలినాలికై
ధనికులపాదం పట్టేకన్నా
దరిద్రజీవం గడిపేకన్నా
ఎత్తించండీ ఎర్రనిజండా
పాలించండీ కూలీరాజ్యము.

యం. భగవంతరావు.

# నిజం

సందె వన్నెల నీలినీడల
స్వర్గ సౌధపు కాంతులన్నీ

        పేదకూలీ బాబు రక్తము
        జాలువారిన తావులేనోయ్

తాళమేసీ పదిలా పరిచిన
ధాన్యరాసుల కొట్టులన్నీ

        కష్టజీవుల యుష్ణ రక్తము
        కరుడుగట్టిన గడ్డలేనోయ్

గాలిదారుల వెలుగు పొడుపుల
దివ్యభోగపు వసతులన్నీ

        కర్మజీవుల మేని చెమటలు
        గారి పెరిగిన మొలకలేనోయ్

నింగి ప్రేలి పొంగి పొరలిన
నీలి మబ్బుల కాళిమంతా

        కుమిలిపొయ్యే పేద గుండెల
        గుచ్చిపోయిన యూర్పు పొగలోయ్

పంగులూరి కోటేశ్వరరావు





# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA1291314[illegible] |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 141 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Sowmya |
| పేజీలు విడదీసినది | Sowmya |
| స్కాన్ చేసినది | [illegible] |
| పరీక్ష చేసినది | SANDHYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |